*RECAP*: RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHEN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE *DEKATRIX*, A *POWERFUL GADGET* WITH *10 POWERS*.

EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: ***SHAPE SHIFTER***- GREEN APPLE, ***SPEED***-MANGO, ***FLIGHT***-ORANGE, ***GIANT***-WATERMELON, ***STRENGTH***- RASPBERRY, ***SHRINK***-LYCHEE, ***INVISIBLE***-PINEAPPLE, ***STRETCH***-MUSK MELON, ***FISSION***-BLACK CURRANT, ***FORCE FIELD***-GUAVA.































ఏంజిల్ ఎవరు? రామ్ & శ్యామ్‌కు ఆమె చెప్పిన మెసేజ్ ఏమిటి?ఆ అబ్బాయిలు డా.మీన్ చేసే అరాచకాలని ఆపగలరా? తర్వాతి ఇష్యూలో తెలుసుకోండి.

# యువ విజేతలు

విశేషాలు:

- రోజర్ ఫెదరర్, పీట్ సాంప్రాస్‌లు, వైదిక్ మున్షా ఆదర్శ క్రీడాకారులు.

గెలుపొందిన అవార్డులు:

- ఏకలవ్య జూనియర్ స్పోర్ట్స్ అవార్డ్ (2008)
- రమత్వీర్ అవార్డ్ (2005)

సాధించిన విజయాలు:

- 9 డబుల్స్ టైటిళ్లను వరుసగా గెలుపొందడం ద్వారా జాతీయ రికార్డు.
- నేషనల్ స్కూల్ గేమ్స్‌లో 3 స్వర్ణ పతకాలు వరుసగా గెలుచుకోవడం ద్వారా సరికొత్త రికార్డు 2008-10.
- 3 ఆసియన్ పతకాలు, 5 ఐటీఎఫ్ సింగిల్స్ మరియు 7 ఐటీఎఫ్ డబుల్స్ పతాకాలు

## వైదిక్ మున్షా

వైదిక్ ఈరోజు ఒక స్టార్ టెన్నిస్ ఆటగాడు. కోచ్ ప్రమేష్ మోడీతో కలిసి ఏస్ టెన్నిస్ అకాడమీలో శిక్షణ ప్రారంభించినప్పుడు అతడి వయస్సు ఏడేళ్లు మాత్రమే. అప్పటి నుంచి అతను ఆట కోసం విపరీతంగా శ్రమించాడు.

వైదిక్ ప్రతిరోజూ 4 గంటల పాటు ప్రాక్టీస్‌లో పాల్గొంటాడు. ఫిట్‌నెస్ శిక్షణ కోసం గంట సమయాన్ని కేటాయిస్తాడు. ఆటలో భాగంగా వివిధ ప్రాంతాలను పర్యటించడం వల్ల పలువురు క్రీడా కారులను కలుసుకునే అవకాశం, వివిధ సంస్కృతులను తెలుసుకునే అవకాశం కలిగిందని, దీనివల్ల నిర్ణయాలు తీసుకునే నేర్పు తనకు సులువుగా అలవడిందని ఇతడంటాడు.

ఆస్ట్రేలియన్ ఓపెన్ (2007) ఎదుర్కొనడం అతి పెద్ద సవాలుగా అతడు భావిస్తున్నాడు. అదే సమయంలో ఆ టోర్నీలో చక్కటి ప్రశంసలు కూడా లభించాయట. సింగిల్స్ కంటే డబుల్స్‌నే ఎక్కువగా ఇష్టపడతానని చెప్పాడు. తన పాఠశాల ఆర్ హెచ్ కపాడా న్యూ హెచ్ఎస్ఎస్ మరియు స్కూల్ ట్రస్టీ రూపక్ కపాడియా తనకు ఇస్తున్న మద్దతుకు ఇతడు కృతజ్ఞతలు చెప్పాడు.

అతడికి చాలా పెద్ద కల ఉంది. టెన్నిస్‌లో ప్రపంచ శ్రేణి గొప్ప క్రీడాకారుడిగా కావాలన్నది అతడి ఆకాంక్ష. ఈ కోరిక సఫలం కావాలని ఆశిస్తూ, వైదిక్‌కు చందమామ శుభాకాంక్షలు.



# ఈ సంచికలో ...



చందమామ సంపుటి: 63 డిసెంబర్ 2010 సంచిక: 12














**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
T Andheri (East), Mumbai-400093.

ప్రియమిత్రులారా!!!

మనం కాస్త విశ్రాంతిగా కూర్చుని దీపావళి మధురస్మృతులను తల్చుకుంటున్నప్పుడు, 2010 సంవత్సరం ముగుస్తోందని గుర్తు కొస్తుంది. ప్రతి సంవత్సరమూ ఇలానే జరుగుతూ ఉంటుంది, ఈ సంవత్సరం మరీ రెప్పపాటు కాలంలోనే గడిచిపోయినట్లు కనిపిస్తోంది. మన గత స్మృతులలోకి తొంగి చూస్తూ, దేశ స్థితిగతులకు, వ్యక్తులకు సంబంధించి కూడా ఈ సంవత్సరం ఎలా సాగిందో కాస్త చూద్దాం.

మనం ఐసీసీ ర్యాంకింగ్స్‌లో టెస్ట్ క్రికెట్‌లో ప్రథమస్థానంలో నిలిచాం. కొన్ని సంవత్సరాల క్రితం వరకు మనం ప్రపంచ క్రికెట్‌లో అధోగతిలో ఉంటూవచ్చిన పరిస్థితిని చూస్తే నిజంగా ఇది అద్భుత విజయమేనని చెప్పాలి. ఆస్ట్రేలియాపై దీటైన విజయం తోటే మన క్రికెట్ జట్టు ఈ ర్యాంకును కొనసాగించగలగింది. ఈ విజయం తర్వాత మనం కామన్‌వెల్త్‌గేమ్స్‌లో పతాకాల సంఖ్య విషయంలో నంబర్ టూ స్థానాన్ని సాధించడం ద్వారా తీసిపోని ప్రదర్శనను చూపించాము. నిజంగానే క్రీడలకు సంబంధించినంతవరకు ఈ ఏడు మన దేశానికి మరపురాని సంవత్సరం. ప్రపంచ బ్యాడ్మింటన్ లో 3వ ర్యాంకింగ్‌కు చేరుకోవడం ద్వారా సైనా నెహ్వాల్ దేశం గర్వించేలా చేసింది.

గత సంవత్సరం వర్షాభావ పరిస్థితులను చవి చూసిన తర్వాత ఈ సంవత్సరం వరుణుడు మనలను కరుణించినట్లే లెక్క. దేశం మొత్తంలో సాధారణ వర్షపాతాన్ని మించి వానలు కురవడం మరీ సంతోషకరం.

నూతన సంవత్సరంలో కూడా మనం సాధించిన దానికంటే మరింత బాగా కృషి చేద్దామని మళ్లీ ప్రతిన పూనుదాం రండి. ఆ విధంగా సంవత్సరం గడిచే కొద్దీ మనం మరింత మెరుగుదల సాధిస్తూ ఉత్తమ పౌరులుగా రూపొందగలం.

క్రీస్తు జన్మదినమైన క్రిస్మస్‌ని మనం డిసెంబర్ 25న జరుపుకుంటాము.

మీరు ఈ క్రిస్మస్‌ని ఎలా జరుపుకున్నారో తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాము. మీ క్రిస్మస్ అనుభవాల విశేషాలను మాకు వివరిస్తూ ఉత్తరాలు, ఈమెయిల్స్ పంపగలరు.

– సంపాదకులు




డిసెంబర్ 2010 Rs. 20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :**
Patricia Pandian
**Content Head - Online :**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :**
Venki
**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :**
Prashant Pawar
**Circulation:**
circulation@chandamama.com
**Head - Sales and Circulation:**
Sanjay B Thorat
**Manager - Sales & Circulation (West & North):**
Vinay K Brid
**Asst. Manager - Sales & Circulation (East):**
Subhankar Rej
**Sales Officer - Circulation:**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Subscription:**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Shruti Art Pvt. Ltd. Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai-400010. Editor :- Prashant Sharad Mulekar

# పాఠకుల లేఖలు



అమెరికాలోనైనా చందమామ అందుతోందట కాని హైదరాబాద్‌లో మాత్రం నెలరోజులు ఆలస్యమవుతుంది. కారణాలు తెలియడం లేదు. అరవై ఏళ్లనుండి చందమామ చదువుతున్న మా లాంటి వారికి మనస్సు చివుక్కు మంటుంది. కనీసం ఇక ముందైనా చందమామ పాఠకులందరికీ సకాలంలో అందేలా చూస్తారని, ఆశిస్తూ...

– పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్

ఈ మధ్యకాలంలో పత్రిక ఆలస్యంగా రావడమే కాక, నవ్యత, జానపద రీతి లోపించింది. ముఖచిత్రం వపా గారిదే.. శంకర్ చిత్రాలు అలనాటివే. ఈ సంచిక సైజు తగ్గింది. చందమామ ప్రారంభంనుంచి నడుపుతున్న ఫోటో వ్యాఖ్యల పోటీని ఎత్తిపారేశారు. లోకజ్ఞానం క్విజ్‌లో పురాణాలపై క్విజ్ పోయి సాహిత్య సంబంధ ప్రశ్నలు లోగడవే ఇస్తున్నారు. గతంలో కొత్త రచయితలకు ప్రోత్సాహమిచ్చి అద్భుతమైన పల్లెటూరి కథలు, పిల్లలూ పెద్దలూ మెచ్చుకునే మాంత్రిక, తాంత్రిక కథలు, లౌక్యం, చతురత, చమత్కారం గల వ్యంగ్య కథలు ఎక్కువగా ప్రచురించేవారు. చందమామకు అలనాటి వైభవం తీసుకుని రండి.

– బొడ్డపాటి రాజేశ్వరమూర్తి, చిలకలపూడి, బందరు

శ్రీనివాస కల్యాణం సీరియల్‌లో హోమగుండంలో శివుడు ప్రత్యక్షమైన దృశ్యం, శంకర్ గారి చిత్రం చాలా బావుంది. బేతాళ కథల బొమ్మలు అంత బాగా ముద్రించబడ లేదు. ముఖ్యంగా శిల్పం, బొమ్మ రంగు వేరే ఉండి ముఖ కవళికలు ఇంకా బాగా అగుపించేలా ఉంటే బాగుండేది. వడ్డాది పాపయ్య గారు వేసిన గోవర్ధన గిరిధారి శ్రీకృష్ణుడి బొమ్మ అద్భుతం.

– గోదావరి లలిత, ఫ్లోరిన్, అమెరికా

feedback@chandamama.com

**Visit us at : http://telugu.chandamama.com**

# చింతచెట్టు దెయ్యం

వినాయకపురంలో రంగయ్య అనే వ్యవసాయదారుడు ఉండేవాడు. అతడు ఎంత కష్టపడినా జీవితంలో పైకి ఎదగలేక పోతున్నాననే నిరాశా నిస్పృహలతో కాలం వెళ్లదీసే వాడు. ఎంత సంపాదించినా కుటుంబ అవసరాలకు కనాకష్టంగా సరిపోయేది తప్ప మిగులు ఏనాడూ లేదు. ఆనక అప్పు చేయక తప్పేది కాదు. ఆ అప్పును వడ్డీతో సహా తీర్చేసరికి తల ప్రాణం తోకకు వచ్చేది.

ఇలా ఉండగా ఒకనాడు రంగయ్య పనిమీద పక్క గ్రామానికి వెళ్లాడు. పని ముగించుకుని తిరుగు ప్రయాణం అయ్యేసరికి చాలా పొద్దు పోయింది. అర్ధరాత్రి సమయానికి తన గ్రామ సమీపానికి వచ్చేసరికి కాలిబాట పక్కనుంచి చింత చెట్టుపైనుంచి ఒక దెయ్యం అతని ముందు దూకింది. రంగయ్య దాన్ని గమనించి కూడా పెద్దగా పట్టించుకోకుండా ముందుకు నడవసాగాడు.

దానికి దెయ్యం ఆశ్చర్యపోయి ''అందరూ నా పేరు ఎత్తితే చాలు, ఆమడ దూరం పరుగెడతారు. నువ్వేంటి, నన్ను అసలు చూడనట్లు వెళ్లిపోతున్నావు!'' అంది. దానికి రంగయ్య చిన్నగా నవ్వి, ''నువ్వు ఏం చేస్తావు? మహా అయితే చంపుతావు అంతే కదా! కాని నేను ఎన్నో సంవత్సరాలుగా అనేక కష్టాలు పడుతూ, నా పరిస్థితిని తలుచుకుని అనుక్షణం చస్తూనే ఉన్నాను. దాని కంటే నీ చేతిలో ఒకసారిగా చావడం నాకు చాలా హాయి. నా కష్టాలు నీ కంటే చాలా పెద్ద దెయ్యాలు... వాటి ముందు నువ్వెంత!'' అని అక్కడ నుంచి ముందుకు నడిచాడు రంగయ్య.

మనిషి కష్టాలు అనే దెయ్యాల ముందు తానెంత అనే ఆలోచనలో పడ్డ దెయ్యం ఇక నుంచి మనుషులను పీడించకూడదు అని నిర్ణయించుకుంది. ఆరోజు నుంచి అది చింతచెట్టు మీదినుంచి కిందికి దిగలేదు.

– ఆర్. కుమార రత్నం



# సిసలు సంపద

కృష్ణాపురంలో ఉండే రామయ్య కూలిపనులు చేసుకుని పొట్టపోసుకుంటూ, కుటుంబాన్ని పోషించుకుంటూ ఉంటాడు. రామయ్యకి నిత్యం ఒక దిగులు వేధిస్తూ ఉంటుంది.

ప్రపంచమంతా బాగుంది. నా పరిస్థితే బాగా లేదన్న దిగులు అది. పెద్ద పెద్ద ఇళ్ళూ, బంగారాలూ, వజ్ర వైఢూర్యాలూ, సిరి సంపదలూ, ఖరీదైన దుస్తులూ కలిగి ఉన్నవాళ్లని చూస్తూ ఉంటే మరీ ఎక్కువవుతూ ఉంటుంది అతని దిగులు.

రోజు రోజుకీ రామయ్య దిగులు ఎక్కువైపోవడం చూసి ''పక్క ఊరిలో అవధూత ఒకాయన మకాం చేశాడట. ఆయన్ని ఒకసారి కలుసుకుంటే ఆయనేదైనా దారి చూపుతాడేమో'' అన్నది రామయ్య భార్య సీతమ్మ. భార్య సలహా బాగానే ఉన్నట్టు అనిపించి, ఆ మరునాడే అవధూత దగ్గరికి వెళ్ళాడు రామయ్య.

రామయ్య చెప్పినదంతా విని ''నీ బాధంతా నిజమే. దేవుడు నీకే సంపదా ఇవ్వలేదు. నీక్కావలసిన సంపదంతా నేను ఏర్పాటు చేస్తాను. అయితే ఆ సంపదలు కావాలంటే నీకిప్పుడున్నవి కొన్ని వదులుకోవాలి. సిద్ధమేనా..'' అన్నాడు అవధూత.

ఆ వచ్చే సంపదకన్నా నాకున్నవి విలువైనవి ఏమీకావు కదా అనుకున్న రామయ్య సిద్ధమే అన్నాడు.

''సరే.. నీ కాళ్ళు వదులుకుంటే బోల్డంత బంగారమూ, చేతులు వదులుకుంటే వజ్ర వైఢూర్యాలూ, కళ్ళు వదులుకుంటే సిరి సంపదలూ, ఖరీదైన దుస్తులూ వస్తాయి. సిద్ధమేనా మరి..?'' అన్నాడాయన.

అసలైన సంపద ఏమిటో అప్పటికర్థమైంది రామయ్యకి. అవధూతకి రెండు చేతులూ ఎత్తి దండంపెట్టి ఇంటికి వచ్చాడు. ఆ రోజునుంచీ తన కాయకష్టాన్నే నమ్ముకుని హాయిగా, తృప్తిగా జీవించసాగాడు.

– కలిగినీడి లక్ష్మీవాసుకి



## బేతాళ కథలు

# ఓటమి భయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా స్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు ''రాజా, నువ్వు ఎంతో శ్రమపడి ఈ పని చేస్తున్నావు. చివరకు విజయం సాధించి కూడా ఆశించిన ఫలితాన్ని వదులుకోవలసిన సందర్భం వస్తుంది. శ్రమ తెలియకుండా విక్రముడనే యువరాజు కథ చెబుతాను విను'' అంటూ ఇలా చెప్పసాగాడు.

పూర్వం కాశ్మీర దేశాన్ని మాధవవర్మ అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. మాధవవర్మ గొప్ప పరాక్రమవంతుడు. అపజయమనేది ఎరుగడు. అయినా మాధవవర్మకు యుద్ధకాంక్ష లేదు. ప్రజలను కన్న బిడ్డల్లాగా పరిపాలించేవాడు. కాశ్మీర దేశానికి పొరుగున అవంతి, మాళవ రాజ్యాలుండేవి. అవంతీ రాజ్యాన్ని ప్రసేనుడు పరిపాలిస్తుండగా, మాళవ



రాజ్యాన్ని శేఖరుడు పరిపాలించేవాడు. వాళ్లిద్దరి మధ్యనా గాఢమయిన స్నేహం ఉండేది...

ఇలా ఉండగా మాధవవర్మ కుమార్తె మధుమతికి యుక్తవయసు వచ్చింది. ఒక్కగానొక్క కూతురు కావడంతో మధుమతిని తన రాజ్యానికి వారసురాలిగా పెంచాడు. మధుమతి అందంలో రతీదేవికి ధీటైనది. మాధవవర్మ ఆమెకు విద్యాబుద్ధులతో పాటు కత్తియుద్ధమూ, గుర్రపు స్వారీ లాంటి యుద్ధ విద్యలలో కూడా మంచి గురువుల దగ్గిర శిక్షణ ఇప్పించాడు. మధుమతి చిత్రలేఖనంలో కూడా మంచి ప్రావీణ్యం సంపాదించింది.

యుద్ధవిద్యలలోనే కాకుండా తన కుమార్తె మధుమతి చిత్రలేఖనంలో కూడా ప్రావీణ్యం సంపాదించినందుకు మాధవవర్మ చాలా సంతోషించాడు. ఆమె గీసిన చిత్రాలను చూసి ఒకరోజు ఆమెను మెచ్చుకుని, ''నిన్నుమించిన చిత్రకారుడు మన రాజ్యంలోనే లేడనుకుంటాను'' అన్నాడు కూతురితో.

అందుకు మధుమతి నవ్వి, ''అలా అనకండి, నన్ను మించిన చిత్రకారుడు మనరాజ్యంలో ఎక్కడో ఉండే ఉంటాడు'' అన్నది. అలా అయితే ఆ చిత్రకారుడిని బయటకు రప్పిస్తానంటూ రాజు ఆ రోజునే తన రాజ్యంలో చిత్రలేఖనం పోటీలు జరగబోతున్నాయంటూ రాజ్యమంతటా దండోరా వేయించాడు.

చిత్రలేఖనం పోటీల్లో గెలిస్తే గొప్ప బహుమతిని పొందవచ్చుననే ఆశతో ఆ పోటీకి చాలా మంది హాజరయినారు. పోటీ జరిగింది. చివరకు సుధాముడు అనేవాడు గీసిన చిత్రం అన్నింటికంటే మిన్నగా ఉండి బహుమతి యోగ్యమయింది. ఆ చిత్రాన్ని మధుమతి కూడా మెచ్చుకుంది. ప్రకటించిన విధంగా సుధాముడికి బహుమతిని ఇచ్చారు.

సుధాముడు బహుమతితో తిరిగి వెళుతున్నప్పుడు మధుమతి అతడిని తన మందిరానికి పిలిపించి అతడు గీసిన చిత్రాన్ని, అతడి చిత్రకళా నైపుణ్యాన్ని మెచ్చుకుంది.

దాంతో సుధాముడు సంతోషించి కొంచెం ఎక్కువ సమయం ఇస్తే అంతకంటే అద్భుతమైన చిత్రాలను అవలీలగా గీయగలనని గర్వంగా చెప్పాడు.

అప్పుడు మధుమతి చిత్రలేఖనంలో పాటించవలసిన జాగ్రత్తల గురించి మెళకువ గురించి అడిగింది. అతడు తనకు తెలిసినవన్నీ చెప్పి చివరకు తాను గెలుపొందిన బహుమతి వల్ల తనకు సంతృప్తి కలగలేదని అన్నాడు.

మధుమతి ఆశ్చర్యపడి ''మరి నీకు సంతృప్తి ఎలా కలిగేద''ని అడిగింది.

ఈ దేశపు రాజుగారి అల్లుడినైతే సంతృప్తి కలిగేదని చెప్పాడతడు.

''నీ ధైర్యానికి మెచ్చుకుంటున్నాను. ఒక చిత్రకారుడిని పెళ్లి చేసుకోవాలని నేనెప్పుడూ అనుకోలేదు. రాజు గారు కూడా అనుకోవడం లేదు. నేను సాధారణ యువతి నయినట్లయితే నిన్ను పెళ్లి చేసుకోవడానికి అంగీకరించే దాన్నేమో ఇప్పుడు నేను అలా చేస్తే ఈ రాజ్యానికే చెడ్డపేరు వస్తుంది. అలా జరగడం నాకిష్టం లేదు. అంతే కాకుండా ఈ దేశపు రాజు గారు గొప్ప పరాక్రమవంతుడినీ, కత్తియుద్ధంలో బాగా నైపుణ్యం ఉన్నవాడినీ తన అల్లుడిని చేసుకోవాలనుకుంటున్నారు. అంతటి పరాక్రమం నీలో ఉందని రుజువు చేసుకుంటే నిన్ను పెళ్ళి చేసుకుంటాను.'' అన్నది మధుమతి.

సుధాముడు మారు మాట్లాడకుండా, తను గెల్చుకున్న బహుమతిని అక్కడే ఉంచి తలొంచుకుని అక్కడినుంచి వెళ్లిపోయాడు.

ఇది జరిగిన కొన్ని రోజులకు ఒక పౌర్ణమి నాటి రాత్రి మధుమతి ఆరుబయట వెన్నెలలో నిద్రిస్తుండగా ఆమెకు ఒక చిత్రమైన కల వచ్చింది. ఆ కలలో ఆమె గుర్రం మీద తమ రాజ్య సరి





గీస్తున్న ఒక అందమైన యువకుడు కనిపించాడు.

అక్కడకు వెళ్లి గుర్రం దిగి నిలబడింది మధుమతి. ఆ యువకుడు ఆమెను ఆపాద మస్తకం చూసి, ''భువికి దిగివచ్చిన రతీదేవిలా ఉన్నావు, ఎవరు నువ్వు?'' అనడిగాడు.

మధుమతి తన గురించి చెప్పి ఆ యువకుడి గురించిన వివరాలను అడిగింది. ఆ యువకుడు తనని మాళవ దేశ యువరాజు విక్రముడిగా చెప్పుకున్నాడు.

తర్వాత విక్రముడు, మధుమతి రాక గురించి అడిగినప్పుడు క్రితం రాత్రి తనకు వచ్చిన కల గురించి చెప్పింది.

''ఆశ్చర్యంగా ఉంది. నమ్మలేకపోతు న్నాను. అంతా నా కలలో వచ్చినట్లుగానే ఉంది'' అన్నది మధుమతి. విక్రముడి అందానికి ముగ్ధురాలవుతూ.

''ఇదేదో దైవ నిర్ణయంలా తోస్తున్నది. మొదటి సారిగా నిన్ను చూసినప్పుడే నీ మీద నాకు ప్రేమ కలిగింది. నీకు అభ్యం తరం లేకపోతే మనిద్దరం పెళ్లి చేసు కుందాం'' అన్నాడు విక్రముడు.

''క్షమించండి. నా పెళ్లి నా చేతుల్లో లేదు. మా నాన్నకు మన ప్రేమ విషయం చెబుతాను. ఆయన అంగీకరిస్తే మనం తప్పకుండా పెళ్ళి చేసుకుందాం'' అన్నది మధుమతి.

విక్రముడు సరేనన్నాడు.

మధుమతి వెనక్కు మళ్లింది. ఆపైన కొన్ని రోజులకు మరోసారి విక్రముడిని

హద్దులు దాటి పొరుగున ఉన్న మాళవ రాజ్యంలోకి ప్రవేశించినట్లూ, అక్కడ పచ్చిక మైదానంలో ఒక రాకుమారుడు కుంచెతో ప్రకృతి చిత్రాన్ని గీస్తున్నట్లూ, తనని చూసి తన అందానికి ముగ్ధుడై తనని ప్రేమించానని, పెళ్లి చేసుకుంటా ననీ అన్నట్లు ఆమెకు కనిపించింది.

తనకు వచ్చిన కల ఎంతవరకు నిజమో తెలుసుకుందామని తెల్లారిన తర్వాత మధుమతి గుర్రమెక్కి వెళ్లి మాళవరాజ్యం లోకి ప్రవేశించింది. మాళవ రాజ్యంలో ప్రకృతి అత్యంత రమణీయంగా ఉంది. పచ్చికమైదానాలు ఎత్తుగా పెరిగిన చెట్లూ, చల్లనిగాలీ ఆమెకు ఆహ్లాదకరంగా తోచాయి. మధుమతి అలా గుర్రంమీద వెళుతున్నప్పుడు ఒక బండరాయి మీద కూర్చుని అక్కడి ప్రకృతి శోభను చిత్రంగా

కలుసుకున్నది. మాటల సందర్భంలో విక్రముడికి కత్తి యుద్ధంలో మంచి ప్రావీణ్యం ఉందని తెలుసుకుంది. అతడితో ఒకసారి కత్తియుద్ధం చెయ్యాలని ఉందని చెప్పింది.

విక్రముడు ఆమెతో కత్తియుద్ధానికి సిద్ధపడ్డాడు. ఇద్దరూ కత్తులు కలిపారు. పోటాపోటీగా యుద్ధం చేశారు. విక్రముడు మెరుపు వేగంతో కత్తిని కదిలించాడు. అతడి ధాటికి మధుమతి తట్టుకోలేకపోయింది. తన ఓటమిని అంగీకరించింది. తనకు కాబోయే భర్త గొప్ప పరాక్రమవంతుడని మురిసిపోయింది.

విక్రముడిని కలిసిన ఈసారి కూడా అతడితో తన ప్రేమ గురించి మధుమతి తండ్రికి చెప్పలేదు. ఈ సంగతి తెలియని మాధవవర్మ కూతురికి పెళ్లిప్రయత్నాలు చేయనారంభించాడు.

మధుమతి అందచందాల గురించి విన్న అవంతీ రాకుమారుడు మాధవుడు ఒక రోజు మాధవ వర్మ కొలువు తీరి ఉండగా వచ్చాడు. అతడు తనను పరిచయం చేసుకుని మధుమతిని తను పెళ్ళాడగోరుతున్నట్లు చెప్పాడు. ఆ సమయంలో తండ్రి పక్కనే ఉన్న మధుమతి, విక్రముడితో తన ప్రేమ గురించి చెప్పి అతడితో పెళ్లికి తను ఇష్టపడుతున్నట్లు చెప్పింది.

మాధవవర్మ ఆలస్యం చెయ్యకుండా ఒక సైనికుడితో విక్రముడికి కబురు పంపాడు.



విక్రముడు రాగానే, ''మీరిద్దరూ మధుమతిని పెళ్ళాడటానికి పోటీ పడుతున్నారు. కానీ మధుమతిని చేపట్టి నాకు అల్లుడయ్యేవాడు కత్తి యుద్ధంలో గొప్ప వీరుడై ఉండాలని నా కోరిక. అందుకని ఇప్పుడు మీరిరువురూ కత్తియుద్ధం చెయ్యండి. ఎవరు గెలిస్తే వాళ్లకు మధుమతితో పెళ్లి జరిపిస్తాను,'' అన్నాడు మాధవవర్మ.

అందుకు ఇద్దరూ అంగీకరించారు.

మందిరంలో పోటీ మొదలయింది. ఇద్దరూ ఒరల్లోనుంచి కత్తులు దూశారు.

మాధవుడితో కత్తిని కలపబోయే ముందు విక్రముడు, మధుమతి కేసి చూశాడు. ఎందుకో ఆమె కళ్ళలో ఒక విధమైన భయం కనబడింది. విక్రముడు ఆశ్చర్యపడ్డాడు.

తర్వాత ఒకరితో ఒకరు హోరాహోరీగా యుద్ధం చేశారు. చివరకు విక్రముడు, మాధవుడి చేతిలోని కత్తిని పడగొట్టి కత్తి యుద్ధంలో విజయం సాధించాడు. మధుమతి కళ్ళతోనే సంతోషాన్ని వ్యక్తం చేసింది.

మాధవవర్మ విక్రముడిని విజేతగా ప్రకటిస్తూ మధుమతికి విక్రముడికి వివాహం జరిపించబోతున్నట్లు ప్రకటించాడు. అప్పుడు విక్రముడు తను మధుమతిని పెళ్లాడబోవటం లేదని చెప్పి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఈ కథంతా చెప్పి శవంలోని బేతాళుడు ''రాజా పోటీలో విజయం సాధించి కూడా విక్రముడు తను ప్రేమించిన మధుమతిని పెళ్లాడటానికి ఎందుకు నిరాకరించాడు? అంతగా పరాక్రమంలేని మనిషిని ఓడించి మధుమతిని పెళ్లాడటమేమిటన్న చులకన భావమా? కేవలం ఒక ఆడదాని కోసం కత్తియుద్ధం చేయవలసి వచ్చినందుకా? ఈ ప్రశ్నకు తెలిసీ సమాధానం చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''విక్రముడు కేవలం పరాక్రమవంతుడే కాదు సునిశిత జ్ఞానం కూడా ఉన్నవాడు, మాధవుడితో పోటీకి తలపడబోయే ముందు మధుమతిని చూసినప్పుడు ఆమె కళ్ళలో స్పష్టంగా ఓటమి భయం కనబడింది. తన వీరత్వం గురించి, కత్తి తిప్పడంలో తన ప్రావీణ్యం గురించి ముందే తెలిసి కూడా మధుమతి కళ్లలో భయం కనబడిందంటే ఆమెకు మనసులో ఏ మూలనో తన శౌర్యం గురించి కొంచెం సంశయం ఉండి ఉండాలి. అందుకే కత్తియుద్ధంలో విజయం సాధించి కూడా, తన వీరత్వం పట్ల పూర్తి నమ్మకం లేని మధుమతిని పెళ్ళి చేసుకోవడాన్ని విక్రముడు నిరాకరించాడు.'' అని ముగించాడు విక్రమార్కుడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

*[ఆధారం : ప్రతాప రవిశంకర్]*





# తండ్రి సలహాలు

చంద్రగిరి గ్రామంలో భీమ శంకరుడు అనే రైతు ఉండేవాడు. అతనికి ఒక్కడే కొడుకు. పేరు కులశేఖరుడు. భీమశంక రుడి భార్య అనారోగ్యంతో మరణించింది. భీమశంకరుడు మరలా పెళ్లి చేసుకో కుండా కొడుకును కష్టపడి పెంచి పెద్ద చేశాడు. చదువు చెప్పించాడు. కులశేఖ రుడు యుక్తవయస్కుడయ్యాడు.

కులశేఖరుడి స్నేహితులందరూ కల వారి పిల్లలు. వారికి వాళ్ళ తల్లిదండ్రులు తమ ఆస్తులను కట్టబెట్టారు. తన తండ్రి అందరిలా తనకు ఆస్తి కట్టబెట్టలేకపోవ టంతో కులశేఖరుడు అసంతృప్తి చెందాడు. తండ్రితో అదేమాట అనేవాడు.

జబ్బుచేసి భీమశంకరుడు మంచాన పడ్డాడు. ఒకరోజు అతడు కొడుకును చేరబిలిచి ''నాయనా..! నీ స్నేహితుల తల్లిదండ్రుల్లా నేను నీకు ఆస్తినివ్వలేదని బాధపడకు. నేను నీకు మూడు సల హాలు చెబుతాను. వాటిని పాటించావంటే నీవూ ధనవంతుడివి కాగలవు.

మొదటి సలహా. ఆకలితో ఉన్నవారెవ రైనా కనిపిస్తే నీవు తినే దానిలో వారికి కొంత పెట్టు. రెండో సలహా. ఎవరైనా బాధలో ఉండటం గమనిస్తే, వారి సమస్య ఏమిటో తెలుసుకుని నీకు చేతనైన సహాయం చేయి. మూడో సలహా ఏమంటే.. ఎవరైనా అపరిచితుడు కనిపించినప్పుడు అతని వేషధారణ పట్టించుకోకుండా గౌరవించు'' అని చెప్పాడు. ఆ తరువాత కొద్దిరోజులకు అతను కన్నుమూశాడు.

తండ్రి మరణానంతరం కులశేఖరుడు తన చదువుకు తగిన ఉద్యోగం కోసం ప్రయత్నించాడు. ఉద్యోగం దొరకలేదు.

---

ఎస్. శివనాగేశ్వర రావు




అతను గ్రామం విడిచి మరో ఊరికి బయలుదేరాడు. మార్గమధ్యాన అతడు ఒక చెట్టుకింద కూర్చుని భోజనం తినేందుకు అన్నంమూట విప్పాడు. పక్కన ఒక బక్కచిక్కిన బైరాగి కనిపించాడు.

కులశేఖరుడికి 'ఆకలితో ఉన్నవారికి నీవు తినే దానిలో కొంతపెట్టు' అన్న తండ్రి సలహా గుర్తుకు వచ్చింది. అతను బైరాగితో ''ఏమైనా తిన్నావా?' అని అడిగాడు. 'తిండి తిని రెండు రోజులు అయింది' అన్నాడు బైరాగి.

కులశేఖరుడు తను తెచ్చుకున్న దానిలో సగం బైరాగికి పెట్టాడు. బైరాగి, కులశేఖరుడు పెట్టింది తిని ఆకలి బాధ తీర్చుకున్నాడు.

తరువాత కులశేఖరుడితో ''నాయనా..! అడిగినా తిండి పెట్టనివారిని చూశాను. అడగకుండానే నా ఆకలి బాధ తీర్చావు. నీకో తాయెత్తు ఇస్తాను'' అని జోలెలోంచి ఒక తాయెత్తు తీసి కులశేఖరుడికిచ్చాడు.

'ఇది దేనికి?' అని అడిగాడు కులశేఖరుడు. ''ఇది మహిమగల తాయెత్తు. పాముకాటుకు దివ్యౌషధం. ఎవరైనా పాము కాటుకు గురయినప్పుడు పాము కాటు దగ్గర ఈ తాయెత్తును తాకిస్తే విషం విరిగిపోతుంది'' అని చెప్పి వెళ్ళిపోయాడు బైరాగి.

కులశేఖరుడు ఆ తాయెత్తును జాగ్రత్త చేసి ముందుకు సాగాడు. మరునాటికి మరో ఊరు చేరాడు. అక్కడ ఒక ఇంటి ముందు రాజయ్య అనే వ్యక్తి, అతని భార్య లక్ష్మమ్మ పెద్దగా రోదిస్తున్నారు. అక్కడ ఇంచుమించు కులశేఖరుడి వయసే ఉన్న యువకుడు స్పృహతప్పి పడిపోయి ఉన్నాడు.

ఆ దృశ్యం చూసినంతనే కులశేఖరుడికి 'కష్టంలో ఉన్నవారికి చేతనైన సహాయం చేయి' అంటూ తండ్రి చెప్పిన రెండో సలహా గుర్తుకు వచ్చింది.

కులశేఖరుడు ఆ దంపతులవద్దకు పోయి ''అయ్యా..! ఎందుకు ఏడుస్తున్నారు? మీకొచ్చిన కష్టం ఏమిటి?'' అని అడిగాడు. అందుకు రాజయ్య ''వీడు నా కొడుకు. పాము కరిచింది. వైద్యుడు చూసి మరిక బ్రతకడని చెప్పాడు'' అంటూ మరలా ఏడవసాగాడు.

''బాధపడకండి. మీ కొడుకును కాపాడే ప్రయత్నం చేస్తాను'' అని చెప్పి తన దగ్గ

రున్న తాయెత్తు తీసి పాముకాటు పడిన చోట తాకించాడు. కొద్ది క్షణాల్లో రాజయ్య కొడుకు లేచి కూర్చున్నాడు.

రాజయ్య దంపతుల ఆనందానికి అవధులు లేకపోయాయి. కులశేఖరుని తమ ఇంటి లోపలకు తీసుకుపోయి అతిథి మర్యాదలు చేసి మంచి భోజనం పెట్టారు. ఆ తరువాత అతనేంపనిమీద బయలుదేరాడో వాకబు చేశాడు రాజయ్య.

కులశేఖరుడు తన ఉద్యోగ ప్రయత్నం గురించి చెప్పాడు. అప్పుడు రాజయ్య ''దిగులు పడకు. మా ఊరి జమీందారు రత్నభూషణుడు నాకు మంచి మిత్రుడు. నిన్ను అతని దగ్గరకు తీసుకుపోతాను. అతను తప్పక నీకు ఉద్యోగం ఇస్తాడు'' అని చెప్పాడు.

చెప్పినట్లే తన మిత్రుడు రత్నభూషణుడి వద్దకు కులశేఖరుడిని తీసుకుపోయి అతను తనకు చేసిన సహాయం గురించి, అతని ఉద్యోగ ప్రయత్నం గురించి చెప్పాడు రాజయ్య.

రత్నభూషణుడు కులశేఖరుడి చదువు గురించి అడిగి తెలుసుకుని అతనికి తన దివాణంలో పద్దులు రాసే ఉద్యోగం ఇచ్చాడు. కులశేఖరుడికి మరిక భుక్తికి లోటు లేకపోయింది.

అలా ఒక సంవత్సరం తిరిగింది. ఒక నాడు కులశేఖరుడు దివాణం నుంచి ఇంటికి పోతుండగా ఒక అపరిచితుడు ఎదురయ్యాడు. అతని వేషధారణ సాదా సీదాగా ఉంది.




అతన్ని చూడగానే కులశేఖరుడికి 'అపరిచితుల వేషధారణ ఎలా ఉన్నా వారిని గౌరవించు' అన్న తండ్రి మూడో సలహా గుర్తుకు వచ్చింది. కులశేఖరుడు అపరిచితుడికి నమస్కరించి, 'అయ్యా..! మీరీ ఊరికి కొత్తలా ఉన్నారు. ఏంపని మీద వచ్చారో చెబితే నేను మీకు సహాయ పడగలను' అన్నాడు.

అప్పుడా అపరిచితుడు 'నా పేరు రంగస్వామి. ఈ ఊరిలో ఉండే రామానందుడిని కలవడానికి వచ్చాను. అతని ఇల్లు తెలియక వెదుకులాడుతున్నాను' అని చెప్పాడు.

అంతలో వాన మొదలైంది. కులశేఖరుడు, రంగస్వామికి తన దగ్గరున్న గొడుగుపట్టి 'రామానందుడి ఇల్లు చూపిస్తాను. నాతో రండి' అన్నాడు.

అందుకు రంగస్వామి ''నీకెందుకు శ్రమ? గుర్తులు చెప్పు నేను వెళ్తాను'' అన్నాడు. 'అసలే కొత్త ప్రదేశం. అందునా వాన. ఎందుకు అనవసరపు శ్రమ. నాతో రండి' అంటూ కులశేఖరుడు, రంగస్వామిని రామానందుడి ఇంటికి చేర్చి తనదారిన తను వెళ్లిపోయాడు.

నెల రోజుల తరువాత రంగస్వామి, జమీందారుగారి దివాణానికి వచ్చి కులశేఖరుడి గురించి వాకబు చేశాడు. అంతలో అటుగా వచ్చిన కులశేఖరుడు రంగస్వామికి నమస్కరించి ''బాగున్నారా..? ఇదివరకు ఓమారు వచ్చిన పని జరిగిందా?'' అని అడిగాడు.

దానికి రంగస్వామి ''మా అమ్మాయి వివాహ సంబంధం నిమిత్తం రామానందుడి ఇంటికి వచ్చాను. కాని ఆ సంబంధం నాకు అంతగా నచ్చలేదు. అందుకే నీ దగ్గరకు వచ్చాను'' అన్నాడు.

''ఈ విషయంలో నేనేం చేయగలను?'' అన్నాడు కులశేఖరుడు. ''ఒక అపరిచితుడిని ప్రేమగా పలుకరించి, సహాయం చేసిన నీ మంచి మనసు నాకు నచ్చింది. నీలాంటి మంచి వ్యక్తి కోసమే నేను వెదుకుతున్నాను. ఒకసారి వచ్చి మా అమ్మాయిని చూడు. నచ్చితే వివాహం చేసుకుందువు'' అన్నాడు రంగస్వామి. కులశేఖరుడు అందుకు సమ్మతించాడు.

రంగస్వామి, కులశేఖరుడిని సాదరంగా ఆహ్వానించి తన కుమార్తెను చూపించాడు. రంగస్వామి కూతురు కులశేఖరుడికి నచ్చింది. ఒక శుభముహూర్తాన రంగస్వామి తన కుమార్తెతో కులశేఖరుడికి వివాహం జరిపించాడు.

వృద్ధుడైన రంగస్వామి త్వరలోనే తన వ్యాపార వ్యవహారాలన్నీ అల్లుడికి అప్పగించి విశ్రాంతి తీసుకున్నాడు. కులశేఖరుడు మామగారి వ్యాపారాలు చూస్తూ, తన తెలివితేటలతో మరింతగా అభివృద్ధి చేసి, పట్టణంలోనే ధనికుడిగా పేరుగడించాడు. తనకంత విలువైన సలహాలిచ్చిన తండ్రిని అతనెన్నడూ మరువలేదు.



# అవసరం

శిల్లంగేరి గ్రామంలో ఉండే బంగారయ్య ఇంటికి, తిమ్మప్ప అనేవాడు అప్పుడప్పుడూ వచ్చి, అతడికి ఐదు అరటిపళ్లిచ్చి, రూపాయి తీసుకుపోతుండేవాడు. తిమ్మప్ప అరటితోట బంగారయ్య ఉన్న గ్రామానికి, రెండామడల దూరంలో ఉన్నది.

ఒకసారి ఏదో శుభకార్యానికి, అరటిపళ్ల అవసరం కలిగి, బంగారయ్య తిమ్మప్ప అరటితోటకు వెళ్లి, వందపళ్లు తీసుకున్నాడు. వాటికి ఇరవై రూపాయలివ్వమన్నాడు, తిమ్మప్ప.

బంగారయ్య ఆశ్చర్యపోతూ, ''అదేమిటి, తిమ్మప్పా! రెండామడల దూరం నడిచివచ్చి, ఐదు పళ్లకు రూపాయి తీసుకునేవాడివి. ఇప్పుడు, నేనే నీ తోటకు వచ్చి కొంటున్నా, అదే ధర ఇవ్వమంటున్నావు,'' అన్నాడు.

అందుకు తిమ్మప్ప నవ్వుతూ, ''ఇందులో న్యాయాన్యాయాల ప్రసక్తి ఎందుకయ్యా! నేనే మీ ఇంటికి వచ్చి, పళ్లు అమ్మానంటే, అది నా అవసరం, ఇప్పుడు మీరే స్వయంగా తోటకు వచ్చి పళ్లు కొంటున్నారంటే, ఇది మీ అవసరం, ఇద్దరి అవసరాలూ ముఖ్యమైనవే కనుక, పళ్లధరలో మార్పు ఎలా ఉంటుంది!'' అన్నాడు. – కోలార్ కృష్ణయ్యార్






# పద్మావతీ పరిచయం

వకుళమాలిక శ్రీనివాసుడిని కన్నకొడుకుగా చూసుకొంటోంది. ఆయన ఆహార విహారాల గురించీ, ఆరోగ్యం గురించీ ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ అబ్బురపరుస్తోంది. ఆమెను ఒక పరిచారికగా కాకుండా తల్లిగానే చూసుకుంటున్నాడు శ్రీనివాసుడు. శ్రీనివాసుడంటే వకుళమాలికకు ప్రత్యేక ఆప్యాయత. వకుళమాలిక అంటే శ్రీనివాసుడికి ప్రత్యేక అభిమానం. అందుకు కారణం వుంది.

వకుళమాత పూర్వజన్మలో ఎవరో కాదు, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడిని ఆలించి, లాలించి పెంచి పెద్దచేసిన యశోద. యశోదగా ఉన్నప్పుడు శ్రీకృష్ణుడి వివాహాలను చూసే అవకాశం ఆమెకు దక్కలేదు. ''నాయనా, కృష్ణా.. నీ వివాహాన్ని చూసి ఆనందించే అదృష్టం నాకు లేదా..?'' అని అడిగింది యశోద. ''కలియుగంలో వేరొక రూపంలో నేను వివాహం చేసుకుంటాను. ఆ శుభకార్యం నీ చేతులమీదుగా జరుగుతుంది. ఆ అవతారంలో తల్లిలేని నాకు నువ్వు తల్లిగా ఉంటావు'' అన్నాడు కృష్ణుడు. ద్వాపర యుగంలో కృష్ణుడిగా అవతరించిన శ్రీమహావిష్ణువే, కలియుగంలో శ్రీనివాసుడిగా వేంకటాద్రిమీద విడిది చేశాడు. యశోదాదేవి వకుళమాలికగా జన్మించి, ఆయనను చేరుకుంది.

వెంకటాద్రి పర్వతానికి కొంచెం దూరంలో ఉన్న నారాయణపురం రాజధానిగా ఆకాశ రాజు పరిపాలన చేస్తున్నాడు. ఆయన రాజ్యం తొండమండలం. ఆకాశరాజు చంద్ర వంశానికి చెందిన సుధర్ముడు అనే రాజు కొడుకు. ఆయన భార్య ధరణీదేవి. వివాహం

వక్కలంకం సూర్యనారాయణ రావు

జరిగి చాలాకాలం అయినా ఆకాశరాజు దంపతులకు సంతానం కలుగలేదు.

పిల్లలు పుట్టనందుకు కుమిలిపోతున్న ఆకాశరాజు తన విచారాన్ని రాజగురువు ముందు వెళ్ళబోసుకున్నాడు. సంతతి కల గాలన్న సంకల్పంతో యాగం చేస్తే పుత్రుడు పుట్టే అవకాశం ఉందన్నాడు రాజగురువు. గురువు సూచన ప్రకారం ఆకాశరాజు యాగశాలకు భూమిని సిద్ధం చేయడానికి బంగారు నాగళ్ళతో దున్నసాగేడు. ఆ నేలలో వేయిదళాల పద్మం, ఆ పద్మంలో చిన్నారి బాలికా కనిపించారు. ఆకాశరాజు వెంటనే ఆ బాలికను చేతులలోనికి తీసుకుని, హృదయానికి హత్తుకున్నాడు. బాలికను సాక్షాత్తూ ఆ భగవంతుడే తనకు ప్రసాదిం చాడనుకున్నాడు.

యాగసన్నాహాలను ఆపివేసి, మందిరా నికి వెళ్ళి బాలికను భార్య ధరణీదేవికి అందించాడు. దైవానుగ్రహంతో లభించిన బాలికను తమ కూతురిగానే భావించారు రాజదంపతులు. నికసించిన పద్మంలాంటి ముఖంతో, పద్మదళాలలాంటి విశాల నేత్రా లతో, సహస్రదళపద్మంలో లభించిన ఆ బాలికకు పద్మావతి అని నామకరణం చేశాడు ఆకాశరాజు. పూర్వం త్రేతాయుగంలో జనక మహారాజుకు యాగ భూమిలో సీతాదేవి లభించిన విధంగా తమకు పద్మావతి లభిం చిందనుకుని ఆనందంతో పొంగిపోయారు రాజదంపతులు.

పద్మావతితోబాటు అదృష్టం రాజదంప తుల జీవితంలో ప్రవేశించింది. పుత్రికా మేష్టి యాగం చేయకుండానే మహారాణి ధరణీదేవి గర్భవతి అయ్యింది. నవమా



సాలు పూర్తి కాగానే ఆమెకు కొడుకు పుట్టాడు. కుమారుడికి వసుదాసుడు అని పేరు పెట్టాడు ఆకాశరాజు.

పద్మావతీ, వసుదాసుడూ బాల్యాన్ని ఆటపాటలతో గడుపుతూ, ఆకాశరాజు దంపతుల ప్రత్యేక పోషణలో పెరిగి యవ్వన వంతులయ్యారు. అందాలబరిణె అయిన పద్మావతిని తగిన సౌందర్యవంతుడైన వరు డికి ఇచ్చి వివాహం జరిపించాలనుకున్నాడు ఆకాశరాజు.

యుక్త వయస్కురాలైన పద్మావతి చెలి కత్తెలతో కలిసి ఆటపాటలతో, బొమ్మల పెండ్లిండ్లతో, ఉద్యానవన విహారాలతో ఉల్లాసంగా కాలం గడుపుతోంది. ఒకనాడు ఉద్యానవనంలో పద్మావతిని కలుసుకున్న నారదుడు ఆమె శరీరంమీద ఉన్న శుభ లక్ష ణాలను బట్టి దైవ స్వరూపుడు ఆమె భర్త అవుతాడని జోస్యం చెప్పాడు.



ఏనుగును వెంటాడుతూ వచ్చిన శ్రీని వాసుడు వారి భయాందోళనలను గ్రహించి, మదపుటేనుగును ఉద్యానవనం నుంచి అవతలికి తరిమివేశాడు. ఆయన చూపులు పద్మావతిమీద వాలాయి. అతిలోక సౌందర్య వతి అయిన పద్మావతి తొలిచూపులోనే ఆయన హృదయాన్ని గెలుచుకుంది.

కోయదొర వేషంలో ఉన్న శ్రీనివాసుడిని చూసి పద్మావతీ, చెలికత్తెలూ బెదిరిపో యారు. ''ఇది అంతఃపుర కాంతలు విహ రించే అభ్యంతరవనం. పురుషులు రాకూ డదు. వెళ్ళిపో..!'' అన్నారు చెలికత్తెలు శ్రీని వాసుడితో.

తొలి చూపులోనే రాకుమారిని వరించా ననీ, ఆమెను వివాహం చేసుకుంటాననీ, ఆమె అంగీకారం తెలిపేదాకా వెళ్ళననీ అన్నాడు శ్రీనివాసుడు. రాకుమారి పద్మావతి ముందు అంత ధైర్యంగా మాటలాడుతున్న ఆ కారునలుపు వనవాసి ఎవరో తెలుకోవాల నిపించింది చెలికత్తెలకు. ఎవరో చెప్పమని అతన్ని ప్రశ్నించారు.

''నా పేరు శ్రీనివాసుడు. నాది చంద్ర వంశం. వాసిష్టగోత్రం. నా నివాసం వేంకటా చలం. నా మాతృమూర్తి వకుళమాలిక...'' అంటూ తన వివరాలు చెప్పాడు శ్రీనివా సుడు. తనలాగే పేరూ, కులగోత్రాలు చెప్ప మని పద్మావతిని అడిగాడు.

పద్మావతి సిగ్గుతో తలవాల్చుకుని ఇలా అంది ''నా పేరు పద్మావతి. ధరణీదేవి నా తల్లి. ఆకాశరాజు నా తండ్రి. మాది అత్రి గోత్రం, చంద్రవంశం...''

ఇద్దరి మాటలూ వింటున్న చెలికత్తెలు భయపడిపోయారు. ఉద్యానవనంలోకి

ఒకనాడు శ్రీనివాసుడు వేటకు తగిన వేషం ధరించి, ధనుర్బాణాలు పట్టుకుని, వకుళమాలిక అనుమతితో వేటకు బయలు దేరాడు. క్రూర జంతువులను వెంటాడుతూ, తనకు తెలియకుండానే నారాయణపురం సమీపంలోని అరణ్యప్రాంతం చేరుకున్నాడు. అక్కడ ఒక మదపుటేనుగు ఆయనకు తార సిల్లింది. శ్రీనివాసుడు ఆ ఏనుగును వెంబ డించాడు. ఘీంకారాలు చేస్తూ, పరుగెడు తున్న ఆ మదగజం రాజుగారి అంతఃపుర ఉద్యానవనంలోకి వెళ్ళిపోయింది.

సరిగ్గా అదే సమయానికి రాకుమారి పద్మావతి చెలికత్తెలతో కలిసి ఉద్యానవన విహారం చేస్తోంది. ఆడుతూ, పాడుతూ పువ్వులు కోసుకుంటున్న పద్మావతీ ఆమె చెలికత్తెలూ అడవి ఏనుగును చూసి భయ పడిపోయారు. గుంపుగా ఒకచెట్టు చాటుకు చేరి ఆందోళనతో కేకలు వేయసాగేరు.

ప్రవేశించిన విషయం రాజుగారికి తెలిస్తే కఠినంగా శిక్షిస్తాడనీ, వెంటనే వెళ్ళిపొమ్మనీ శ్రీనివాసుడిని హెచ్చరించారు. పద్మావతి సౌందర్యాన్ని చూస్తూ మైమరచిపోయిన శ్రీనివాసుడు చెలికత్తెల మాటలను పట్టించుకోలేదు.

పద్మావతి రెప్పపాటు లేని కళ్ళతో శ్రీనివాసుడినే చూస్తోంది. నీలిమేఘంలాంటి శరీర వర్ణం. ఎత్తయిన భుజాలు. పొడవుగా, మోకాళ్లదాకా ఉన్న అందమైన చేతులు, విశాలమైన వక్షస్థలం. పెద్ద పెద్ద కళ్ళు. చిరునవ్వులు చిందిస్తున్న పెదవులు. శ్రీనివాసుడి సౌందర్యాన్ని చూస్తూ పద్మావతి మైమరచిపోయింది. చెలికత్తెలు పద్మావతి చేతులు పట్టుకుని అంతఃపురంవైపు నడిపించారు. చెలికత్తెల బలవంతంమీద వెళ్తున్న పద్మావతి శ్రీనివాసుడివైపే చూస్తోంది. పద్మావతి కనుమరుగయ్యేదాకా మైమరచి నిలిచి ఉన్న శ్రీనివాసుడు బరువుగా నిట్టూర్చి ఉద్యానవనంలోంచి అవతలికి నడిచాడు.

వేంకటాద్రి మీద ఉన్న తన నివాసానికి చేరుకున్న శ్రీనివాసుడు రాకుమారి పద్మావతి మీద మొలకెత్తిన అనురాగంతో పిచ్చివాడిలా అయిపోయాడు. అన్నమూ, నీళ్ళూ ముట్టకుండా పద్మావతి గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు.

అతని పరధ్యానానికి కారణమేంటో తెలుసుకోవడానికి వకుళమాలిక ప్రయత్నించింది. ఆమె ఎన్ని ప్రశ్నలు వేసినప్పటికీ శ్రీనివాసుడు సమాధానం చెప్పలేదు. చాలా సేపటికి మౌనం వీడి, తన పరధ్యానానికి కారణమేంటో వివరించాడు.

వేటకు వెళ్ళిన తాను మదపుటేనుగును వెంబడిస్తూ, అంతఃపుర ఉద్యానవనం చేరుకున్న సంగతీ, అక్కడ పద్మావతిని చూసి, మనసుపడిన సంగతీ చెప్పాడు శ్రీనివాసుడు. ''పద్మావతి నా మనస్సును పూర్తిగా ఆక్రమించింది. ఆమెను వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. పద్మావతిని కాకుండా మరొకరిని పెళ్ళి చేసుకోలేను'' అన్నాడు వకుళమాలికతో.

అతని మనసు దోచిన పద్మావతి ఎవరో, ఆమె తల్లిదండ్రులు ఎవరో వివరంగా చెప్పమని అడిగింది వకుళమాలిక.





# పంచతంత్ర కథలు

గుంట నుంచి పైకొచ్చిన మూడు మృగాలూ బ్రాహ్మడితో ''గుంటలో ఉన్న మనిషి పరమపాపి. వాణ్ణి బయటకు లాగకు, వాడి మాట నమ్మకు'' అన్నాయి. తరువాత పులి బ్రాహ్మడితో ''దూరాన కనబడే ఆ కొండ చూశావా? దాని ఉత్తర పార్శ్వపు లోయలో నా నివాసం. నువ్వు అక్కడికి వచ్చినట్టయితే నీకు ప్రత్యుపకారం చేసి, నీ రుణం తీర్చుకుంటాను'' అన్నది.

అది వెళ్ళిపోగానే కోతి, ''పులి ఉండే చోటుకు ఎదురుగా ఒక జలపాతం ఉన్నది. దాని సమీపంలోని మర్రిచెట్టు నా నివాసం. నీకు అవసరమైనప్పుడు అక్కడికి రా'' అని వెళ్ళిపోయింది. ''నీకు ఎప్పుడైనా అపాయం కలిగితే నన్ను తలుచుకో'' అని పాము కూడా వెళ్ళిపోయింది.

జంతువులన్నీ వెళ్ళిపోయాక గోతిలో ఉన్న మనిషి, ''బ్రాహ్మడా, నన్ను కూడా పైకి లాగు'' అని కేక పెట్టాడు. సాటివాడు గదా అని బ్రాహ్మడు జాలిదలచి ఆ మనిషినీ పైకి లాగాడు. పైకి వచ్చాక వాడు... ''నేను భరుకచ్ఛానికి చెందిన స్వర్ణకారుణ్ణి. నీకెప్పైనా బంగారు నగలు చేయించుకోవాలని ఉంటే నా వద్దకు రా'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

తరువాత బ్రాహ్మడు చాలా రోజులు తిరిగాడుగానీ ఏమీ సంపాదించలేకపోయాడు. తిరుగు ప్రయాణంలో అతను కోతి ఉండే చోటుకి వెళ్ళాడు. కోతి అతనికి తినేందుకు మధుర ఫలాలను ఇచ్చింది. వాటిని తిని అతను ఆకలి తీర్చుకున్నాడు.

కోతి అతనితో ''పళ్ళు కావాలంటే రోజూ రా'' అన్నది.

''ఇక నీ రుణం తీరిపోయింది. పులిని చూపించు'' అన్నాడు బ్రాహ్మడు. కోతి అతనికి పులిని చూపింది. పులి అతనికి ఒక

మిత్రభేదం - 13



భావించిన, రాజు హంతకుణ్ణి పట్టి ఇచ్చిన వాడికి పెద్ద బహుమానం ప్రకటించాడు. ఈ బ్రాహ్మడే హంతకుడై ఉండాలనుకుని, స్వర్ణకారుడు బ్రాహ్మణ్ణి రాజుకు అప్పగించి బహుమానం పొంద నిశ్చయించాడు.

''అయ్యా.. నువ్వు ఇక్కడే ఉండు, నేను ఇద్దరు, ముగ్గురు బంగారు వర్తకులకు ఈ నగలు చూపించి, ఇప్పుడే వస్తాను'' అని రాజభవనానికి వెళ్ళి, రాజుకు ఆభరణాలు చూపించి, వాటిని తెచ్చిన బ్రాహ్మడు తన ఇంటివద్ద ఉన్నాడని చెప్పాడు.

రాజభటులు వెళ్ళి, ఆ బ్రాహ్మణ్ణి పట్టి బంధించి రాజు వద్దకు తీసుకొచ్చారు. ఆ బ్రాహ్మడు ఏమి చెప్పేదీ వినకుండానే రాజు అతనికి మరణదండన విధించాడు.

అప్పుడు బ్రాహ్మడు పామును తలచుకున్నాడు. వెంటనే పాము అతడి దగ్గిరకు వచ్చి, ''నా వల్ల ఏం సహాయం కావాలి?'' అని అడిగింది. ''నన్ను ఈ కాళ్లకూ, చేతులకూ ఉన్న బంధాల నుంచీ, చెరనుంచీ విడిపించు'' అన్నాడు బ్రాహ్మడు.

పాము బ్రాహ్మడికి చెప్పవలసింది చెప్పి, వెళ్ళి రాణిని కాటు వేసింది. అంతఃపురంలో రోదనధ్వనులు బయలుదేరాయి. నగరం అట్టుడికిపోయింది. వైద్యులూ, మంత్రవేత్తలూ, వచ్చి ఏవేవో తంత్రాలు చేశారు. కానీ స్పృహతప్పి పడిపోయిన రాణి కళ్లు తెరవలేదు.

రాణిని బతికించిన వారికి గొప్ప బహుమానం ఇస్తానని రాజు దండోరా వేయించాడు. అది విని, ఖైదులో ఉన్న బ్రాహ్మణుడు రాణిని తాను బ్రతికిస్తానన్నాడు. వెంటనే అతన్ని విడుదల చేసి, రాజు వద్దకు

చంద్రహారమూ, ఇతర ఆభరణాలూ ఇస్తూ.. ''ఎవరో రాజకుమారుడు ఎక్కిన గుర్రం అతని వశంతప్పి పరిగెత్తుతూ అతన్ని పడేసింది. అతను చచ్చిపోయాడు. అతని ఆభరణాలన్నీ నీ కోసం దాచి ఉంచాను. కనుక వీటిని తీసుకుని వెళ్ళు'' అన్నది.

బ్రాహ్మడు ఆ ఆభరణాలను తీసుకుని, స్వర్ణకారుడి వద్దకు వెళ్ళాడు. స్వర్ణకారుడు అతనికి స్వాగతం చెప్పి, విందు భోజనం పెట్టి, ''నావల్ల ఏమైనా కావాలంటే ఆజ్ఞాపించు'' అన్నాడు. ''కొంత బంగారం తెచ్చాను. దాన్ని అమ్మిపెట్టు'' అన్నాడు బ్రాహ్మడు.

స్వర్ణకారుడు బ్రాహ్మడివద్ద నుంచి ఆభరణాలు తీసుకుని, అవి తాను రాజకుమారుడి కోసం చేసినవేనని గ్రహించాడు. రాకుమారుడి కోసం వెతకగా, అతని శవం కీకారణ్యం మధ్య ఇటీవలనే దొరికింది. అతని నగలు మాత్రం లేవు. హత్య జరిగిందని

తీసుకుపోయారు. రాణికి చికిత్స చెయ్యటానికి రాజు అనుమతించాడు. బ్రాహ్మణుడు రాణి చెయ్యి తాకగానే విషం విరిగిపోయి, రాణి కళ్ళు తెరిచింది. రాజు పరమానందభరితుడై, బ్రాహ్మణుడికి అంతులేని కానుకలిచ్చి, ''అయ్యా.. మీకు ఆ నగలు ఎలా వచ్చాయి?'' అని అడిగాడు. బ్రాహ్మణుడు జరిగినదంతా చెప్పాడు. రాజు, స్వర్ణకారుడికి శిక్ష విధించి, బ్రాహ్మణ్ణి తన మంత్రిగా నియమించాడు. బ్రాహ్మడు తన భార్యనూ, బిడ్డలనూ తెచ్చుకుని, వారితో సుఖంగా ఉన్నాడు.

పింగళకానికి కృతఘ్నుడి కథ చెప్పి దమనకం ఇంకా ఇలా అన్నది:

''మిత్రుడు, గురువు, బంధువు, రాజు నేరం చేస్తే దండన పొందాలని మనువు చెప్పాడు. మహారాజా.. ఈ ఎద్దు ద్రోహి. అతనితో పొత్తు పాములపుట్టపై శయనించటంలాంటిది, తగలబడుతున్న ఇంట నివసించటం లాంటిది.''

''నువ్వు చెప్పినది నిజమే మిత్రమా. అందుచేత అతన్ని హెచ్చరిస్తాను'' అన్నది పింగళకం. ''ఏమిటీ? హెచ్చరించటమా! అలాంటి వాడిపట్ల తక్షణ చర్యలే తప్ప మాటలు పనికిరావు. నల్లి కథలోలాగా ఇతన్ని తక్షణం చంపి పారెయ్యాలి'' అన్నది దమనకం.

''ఏమిటా కథ?'' అని పింగళకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది:

నల్లి కథ

పూర్వం ఒకరాజు ఉండేవాడు. అతనికి ఉత్తమమైన శయనాగారం ఉండేది. అందులో అత్యంత సుఖప్రదమైన పరుపు ఉండేది. ఆ పరుపు ముడతలలో, తెల్లని దుప్పటికింద దాగి మందవిసర్పిణి అనే ఆడపేను జీవిస్తూ, రోజూ పక్కలు పరిచేటప్పుడు తెలివిగా తప్పించుకునేది. దుప్పట్లు మార్చేటప్పుడు పరుపులో దాక్కునేది. రాత్రి పూట రాజు వచ్చి పడుకుని నిద్రపోగానే, ఆ పేను రాజు తలలో ప్రవేశించి, నిద్రాభంగం కలుగకుండా ఆయన రక్తం తాగేది. ఇలా రాచనెత్తురు తాగి ఆ పేను తెగబలిసి, సుఖంగా జీవిస్తూ వచ్చింది.






# ప్రకృతి మహిమ

కుంతల దేశాధిపతి సుధీర వర్మకు మునులు, రుషులపట్ల అంతగా సదభిప్రాయం ఉండేది కాదు. అనునిత్యం విందు, వినోదాలతో కాల క్షేపం చేస్తూ ప్రజల బాగోగులు అంతగా పట్టించుకునేవాడు కాదు.

ఒకసారి వరుసగా చాలా ఏళ్ళు వర్షాలు కురవక పోవడంతో రాజ్యమంతా కరవు కాటకాలు విలయతాండవం చేశాయి. అదే సమయంలో విద్యానందుడనే మహర్షి తన శిష్యగణంతో సంచరిస్తూ కుంతల దేశం వచ్చాడు. పచ్చదనం ఆనవాళ్ళే లేక మోడు వారిన ప్రకృతిని, తడిలేక ఎండిపోయి బీటలువారిన నేలనీ గమనించాడు విద్యా నందుడు. ప్రజలు రాజధాని వెలుపల ఆశ్ర మంలో ఉంటున్న అతని దర్శనార్థం వెళ్ళి తమ గోడు వినిపించారు. తమపై దయ తలచి వర్షాలు కురిసేలా చేయమని బహు దీనంగా వేడుకున్నారు.

ప్రజల కన్నీళ్ళు చూసి చలించిన విద్యా నందుడు మేఘమథనంతో వర్షాలు కురిసేలా చేశాడు. ప్రజలంతా హర్షాతిరేకంతో మహర్షిని వేనోళ్ళ పొగడసాగారు. అంతట విద్యానం దుడు తనను దర్శించేందుకు వచ్చిన జను లను ఉద్దేశించి ''మీరంతా నాపట్ల భక్తి, విశ్వాసాలను తలా ఒక పచ్చని మొక్క నాటి, దాన్ని సంరక్షించి పచ్చదనాన్ని వ్యాప్తి చేయటం ద్వారా ప్రకటించండి'' అంటూ ఉపదేశిం చాడు.

జనుల నోట విద్యానందుని కీర్తి, గొప్ప తనాన్ని విన్న సుధీర వర్మకి ఆ మహర్షిని చూడాలన్న కుతూహలం కలిగింది. విద్యా నందుని తన వద్దకు తీసుకురావలసిందిగా భటులను పంపించాడు. సుధీర వర్మ దురుసు ప్రవర్తనకు ఎంతమాత్రమూ నొచ్చుకోక నిర్మల చిత్తుడైన విద్యానందుడు సుధీరవర్మ కొలు వుకి బయలుదేరాడు.

మల్లారెడ్డి మురళీ మోహన్

విద్యానందుని చూడగానే సుధీరవర్మ, మహర్షి తన రాజ్యానికి చేసిన మేలుకి కృతజ్ఞ తలు సమర్పించడానికి బదులు, తనక్కూడా మేఘమథనం ద్వారా వర్షాన్ని కురిపించే విద్యని ఉపదేశించాల్సిందిగా బలవంతం చేశాడు. విద్యానందుడు అందుకు నిరాక రించాడు.

సుధీర వర్మ, కోపోద్రిక్తుడయి విద్యానం దుణ్ణి చెరసాలలో బంధించాడు. మర్నాడు వ్యాహాళికి వెళ్తున్న సుధీర వర్మ, దారి పొడ వునా ప్రజలు చాలామంది చేతిలో చిన్న చిన్న మొక్కలు పట్టుకుని వెళ్తుండటం గమ నించి, విషయం ఏమిటో తెలుసుకురమ్మని ఓ భటుణ్ణి పంపించాడు. తిరిగొచ్చిన ఆ భటుడు, ప్రజలంతా విద్యానందుని చూడ్డా నికి అతని ఆశ్రమానికి వెళ్తున్నట్లు చెప్పాడు. ఈ వింతను సుధీరవర్మ స్వయంగా చూడ దలచి విద్యానందుని ఆశ్రమం వద్దకు వెళ్ళాడు. దూరంగా నిల్చుని చూడగా విద్యా నంద మహర్షి స్వయంగానే కాక, శిష్యుల చేత, ప్రజలచేత మొక్కలు నాటిస్తూ కని పించాడు. సుధీరవర్మ వెంటనే చెరసాల దగ్గ రికి వెళ్ళి చూడగా, అక్కడ కారాగారంలో విద్యానందుడు ప్రశాంత చిత్తుడయి ధ్యాన ముద్రలో కూర్చుని ఉన్నాడు.

మహర్షి మహిమను కళ్ళారా చూసిన సుధీర వర్మకి జ్ఞానోదయమై, ‘‘స్వామీ.. నన్ను మన్నించండి’’ అంటూ అతని కాళ్ళపై పడి పశ్చాత్తాపం చెందాడు. అంతట విద్యా నందుడు ‘‘రాజా..! మంత్రాలు, మహి మలు, నీకు ఉపదేశిస్తే వాటిపైనే ఆధారపడి నువ్వు ప్రకృతిని, ప్రజలనూ ఉపేక్షించే అవ కాశం ఉంది. అందుకనే నేను నీకా విద్య ఉపదేశించలేదు. అంతేగాక, ఇలా క్షామం సంభవించినప్పుడల్లా మంత్రాలు, మహి మలను ఆశ్రయించవచ్చనే భావన ప్రజల్లో కలిగితే వారు సోమరులయ్యే అవకాశమూ ఉంది. కనుక ప్రకృతిని నిరాదరణకు గురి చేయక పచ్చదనాన్ని పట్టించుకుంటే, సకా లంలో వర్షాలుపడి కరవు, కాటకాలకు తావే ఉండదు’’ అని ప్రబోధించాడు.

మహర్షి బోధనలకు ప్రభావితుడైన సుధీర వర్మ అతని బోధనల ప్రకారం నడుచుకుంటూ, ప్రజారంజకంగా పరిపాలన సాగించాడు.






# అనుభవం నేర్పిన పాఠం

ప్రతిమాపుర రాజు విశారదుడికి వేటంటే మహా ప్రీతి. ఆ మత్తులో పడి ఎవరినీ పట్టించుకునేవాడు కాదు.

ఒకసారి విశారదుడు వేటకు బయలుదేరే సమయానికి కొందరు పల్లెవాసులు రాజును కలిసి తమకు పంటలు పండక తిండిగింజలు కరువయ్యాయని, ఆకలితో అల్లల్లాడుతున్నామని, తక్షణం తమను ఆదుకోవాలని మొరపెట్టుకున్నారు.

తను వేటకెళ్ళే సమయంలో ఆటంక పరిచినందుకు మండిపడుతూ వారందరినీ కారాగారంలో వేయించాడు విశారదుడు.

రథసారథి వినమ్రుడు అడివిలోకి పోనిచ్చాక ఒక్కసారిగా రథం ఆగిపోయింది.

''అదేమిటి? మధ్యలో ఆపేశావేమిటి? అసలే వేటకు కాలాతీతమయిపోతుంటే..'' అని చిరాకుపడ్డాడు విశారదుడు.

''రాజా! గుర్రం మరి ముందుకు పోనంటూంది. దానికి ఆకలయితే చాలు ఠక్కున ఆగిపోతుంది. దాని ఆకలి తీరాక గాని మరల నడవదు,'' అన్నాడు రథం దిగిన వినమ్రుడు.

గుర్రానికి కాసిన్ని గుగ్గిళ్లను తినిపించి, నీళ్లు తాగించాక, వారి ప్రయాణం మళ్ళీ సాగింది.

అయితే రాజు దురదృష్టం కొద్దీ ఆ రోజు అతని వేటలో ఏ ఒక్క జంతువు చిక్కలేదు. మునిమాపు వేళ దాటిపోయింది. వేట మాని తిరిగి వస్తున్న సమయంలో మళ్ళీ రథం ఆగిపోయింది.

''అదేమిటి? మధ్యలో ఆపేశావు? అసలే చీకటి పడుతోంది.'' అని వినమ్రుడి మీద మండిపడ్డాడు విశారదుడు.

''గుర్రం బాగా అలసిపోయింది. పరుగెత్తలేకపోయింది. కాస్సేపు ఆగాకగానీ

కె.కె. రఘునందన

వెళ్ళలేం.'' అని వినమ్రుడు గుర్రాన్ని తీసుకెళ్లి చెట్టుకు కట్టేశాడు.

రాజు విశారదుడు కూడా వేటలో బాగా అలసిపోయి ఉన్నాడు. వేట పడక వేటలో ఎక్కువ సమయం గడపడంతో కడుపు నకనకలాడుతోంది. రాను రానూ ఆకలి బాధతో విలవల్లాడిపోయాడు.

ఓ గంట తరవాత గాని గుర్రాన్ని రథానికి పూన్చలేదు వినమ్రుడు. అప్పటికే రాజు సొమ్మసిల్లిపోయే పరిస్థితిలో ఉన్నాడు.

ఇలా కోటకి చేరిన వెంటనే అలా విశారదుడు ఆబగా తినాలని భోజన శాలకు వడివడిగా నడిచాడు. కాని, వండిన పదార్థాలేవీ లేవక్కడ. ఆకలి దహించుకుపోతుండటంతో అక్కడ గిన్నెలోని గంజిలో ఉప్పు కలుపుకొని గబగబ తాగేశాడు.

ఆ సన్నివేశాన్ని చూసిన వినమ్రుడు, ''రాజా! చూశారా! ఒక్క రోజు ఆలస్యమయితేనే తమరు ఆకలి బాధకు తాళలేకపోయారు. కడుపు నింపుకోవడానికి గంజినీళ్లు తాగి ఆ బాధను చల్లార్చుకున్నారు. మరి ప్రతిదినం ఆ గంజి నీళ్లు కూడా లేనివారు రాజ్యంలో ఎందరున్నారో ఊహించండి. తమ ఆకలి బాధలు తీర్చమంటూ వచ్చిన పేదలు తమ గోడు వినిపించుకోడానికి వస్తే, నిర్దాక్షిణ్యంగా వారిని చెరసాల పాలు చేశారు. అది న్యాయమా! ఆలోచించండి. మీకు ఇంతకాలం ఆకలి బాధ తెలీదు. అది తెలిసేలాగ చేయాలనే నేను అడవిలో ఆలస్యం చేశాను. మీ అనుభవంలోకి రావాలని, వారికి న్యాయం జరగాలని నేను చేసిన ఈ ప్రయత్నం మిమ్మల్ని నొప్పిస్తే క్షమించండి.'' అని తలవంచుకున్నాడు వినమ్రుడు.

ఆకలి బాధ ఎంత ఘోరమయినదో స్వయంగా అనుభవించిన విశారదుడు పల్లెవాసుల పట్ల అంత నిర్దయగా ప్రవర్తించినందుకు పశ్చాత్తాపపడి, వారిని చెరసాల నుండి విడుదల చేయడమే కాక, వారికి ఒక సంవత్సరం పాటు తినడానికి సరిపోయేలాగ తిండిగింజలు ఇచ్చి పంపాడు.

అది మొదలు రాజ్యంలో కరువు పరిస్థితులపై దృష్టి సారించి, నివారణా కార్యక్రమాలను చేపట్టాడు విశారదుడు.





# గెలిచిన ఓటమి

రామాపురంలో ఉన్న మహేశం అనే రైతు యువకుడు స్వతహాగా తెలివైనవాడు, సరదా మనిషి. అందమూ, డబ్బూ, తెలివి తేటలూ పుష్కళంగా ఉన్న అతడికి పిల్లనిస్తామని చాలామంది ముందుకు రాసాగారు. కానీ, వాళ్లెవర్నీ చేసుకోనని మహేశం ఖచ్చితంగా చెప్పేశాడు. మహేశం తాత శివయ్య, అతణ్ణి ఒకనాడు దగ్గిరకు పిలిచి.. ''ఏరా.. చూపించిన ప్రతిపిల్లనూ నాకొద్దు పొమ్మంటే, నీకు పెళ్లి ఎప్పుడయ్యేట్టూ, మీ అమ్మచేతికి ఆసరా ఎప్పుడు దొరికేట్టూ?'' అన్నాడు.

తాత మాటలకు మహేశం నవ్వి, ''అమ్మ చేతికింద ఆసరా కోసమా తాతా.. నా పెళ్లి కోసం నువ్వు కలవరిస్తున్నది? ముందే చెబితే, ఏనాడో ఒక మంచి పనిపిల్ల మెళ్లో తాళికట్టి, తీసుకొచ్చి ఉండేవాణ్ణే!'' అన్నాడు.

మనవడి చమత్కారానికి శివయ్య కూడా నవ్వుతూ, ''మాటలకేంగానీ.. చూపిన ప్రతి పిల్లనూ కాదన్నావంటే, చివరకు నాలాగే, మీ నాయనమ్మలాంటి ఎవర్తె పాలనో పడగలవు'' అన్నాడు.

శివయ్య మాటలు విన్న మహేశం నాయనమ్మ.. ''అవునురా మహేశం.. అరచెయ్యంత ఇంట్లో, అరవయ్యారు సుఖాలూ అమర్చిపెట్టగల ఆడది విషంకాదు మరీ..!'' అంటూ దీర్ఘం తీసింది.

మహేశం నవ్వుకుంటూ.. ''తెల్లవారి లేస్తే బ్రతుకంతా గడిచేది భార్యతోనే. ఎంత ఇంట్లో పనిచేసేదానికైనా కాస్తో, కూస్తో చురుకుదనమూ, తెలివితేటలూ ఉండొద్దా తాతయ్యా..? అలాంటి పిల్ల దొరికిననాడే పెళ్ళాడతాను'' అన్నాడు.

ఇలా ఉండగా, పక్క పల్లెలో ఉంటున్న శివయ్య స్నేహితుడు రమణయ్య అనే మరొక వృద్ధుడు శివయ్యను చూసేందుకు వచ్చాడు. ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకోసాగారు.

**25** సంవత్సరాల చందమామ కథ

ఆ సమయంలో, ఇంట్లో చలాకిగా తిరుగుతున్న మహేశాన్ని చూసి రమణయ్య ''నీ మనవడేమిట్రా శివయ్యా..?'' అని అడిగాడు:

''అవును, మా సూరయ్య పెద్దకొడుకు మహేశం'' అన్నాడు శివయ్య.

''అలాగా..! చాలా పెద్దవాడయ్యాడే, పెళ్లి ప్రయత్నాలేమైనా చేస్తున్నారా..?'' అని అడిగాడు రమణయ్య. శివయ్య తన మనవడి ధోరణి గురించి రమణయ్యకు చెప్పాడు.

''బావుంది.. మీవాడు నా మనవరాలు గౌరమ్మకు సరైన జోడులా ఉన్నాడు'' అన్నాడు రమణయ్య.

''నీ మనవరాలు అంత తెలివైందా..?'' అని ప్రశ్నించాడు శివయ్య కుతూహలంగా.

''రమణయ్య మనవరాలంటే ఏమనుకున్నావు? తెలివితేటలలో నీ మనవడు దాని ముందు తీసికట్టనుకో..!'' అన్నాడు రమణయ్య గర్వంగా. స్నేహితుడి మాటలకు శివయ్య రోషపడి, అయితే, ''నా మనవడు వచ్చి, ఆ సంగతేదో చూడవలసిందే మరి..'' అన్నాడు. మహేశం ఒక్కడూ, రమణయ్యతో కలిసి వెళ్ళేటట్టూ గౌరిని చూసి నచ్చితే పెళ్ళాడేటట్టూ నిర్ణయం అయింది.

ఇద్దరూ బయలుదేరారు. ఇంట్లో అడుగుపెడుతూనే రమణయ్య ఇంటిల్లిపాదినీ కేకలుపెట్టి పిలిచి, ''మా శివయ్య బావ మనవడు'' అంటూ మహేశాన్ని అందరికీ పరిచయం చేశాడు. తర్వాత మనవరాలు గౌరి వైపు చూస్తూ, ''గౌరమ్మా.. మనవడు గొప్ప తెలివైనవాడనీ, మా శివయ్య తెగ మురిసిపోతున్నాడు. నా మనవరాలు, నీ మనవడికేమీ తీసిపోదని చెప్పి, కావలసివస్తే వచ్చి చూసుకోమని పందెంకాసి మరీ మహేశాన్ని ఇక్కడికి తీసుకొచ్చాను'' అన్నాడు.

తాత మాటల్లో లీలగా ధ్వనిస్తున్న భావం అర్థమై, గౌరి ముఖం ఎర్రబడింది. ఆకర్షణీ





యంగా, చురుకుగా ఉన్న గౌరి ముఖం చూడగానే.. ఫర్వాలేదు, తెలివైన పిల్లే..! అన్న భావం కలిగింది మహేశానికి.

మహేశం, గౌరివైపు చూసి చిరునవ్వుతో.. ''నాకు చాలా దాహంగా ఉందండీ.. తోడ కుండా, పట్టకుండా మనిషికి అందని ఎత్తులో ఉండే తియ్యటినీళ్లు మీ ఇంట్లో కాస్త ఇప్పిస్తారా..?'' అన్నాడు.

గౌరి చిరునవ్వుతో తలవూపి, ''క్షణంలో తెస్తాను. ఉన్నది ఉన్నట్టే తాగుతారా, మనిషి చేసుకున్నవాటిల్లో తాగుతారా..?'' అని మహేశాన్ని ప్రశ్నించింది.

''ఉన్నది ఉన్నట్టు తాగలేను, లోటాలో తెచ్చిపెట్టండి!'' అన్నాడు మహేశం, గడుసు పిల్లే అని అనుకుంటూ. రెండు నిమిషాల్లో గౌరి, లోటా నిండా కొబ్బరినీళ్లు తీసుకుని వచ్చింది. అందరూ గౌరిని అడిగి, లోటాలో ఏమున్నదో తెలుసుకుని ఆశ్చర్యపోయారు.

''ఇవా, నువ్వడిగిన నీళ్ళు!'' అంటూ రమణయ్య, మహేశాన్ని మెచ్చుకున్నాడు.

మహేశం, రమణయ్యతో ''సగం చచ్చిన దాని కోసం, పూర్తిగా చచ్చేదానివల్ల సుఖంగా బ్రతికేవాళ్ళెవరో చెప్పమనండి, మీ మనవ రాలిని?'' అన్నాడు.

అందుకు గౌరి నవ్వుతూ, ''అవన్నీ ఏంటో చెబుతాగానీ.. ఆ సుఖంగా బతికేవాళ్ళు, మీ ఇంటికి ఎన్నాళ్ళకొకసారి వస్తారు?'' అని ప్రశ్నించింది. వెంటనే మహేశం ముఖం వికారంగా పెట్టి, ''ఛీ.. వాళ్ళు మా ఇంటికి అసలు రానేరారు!'' అన్నాడు.

''రక్షించారు! ఇక వినండి. సగం చచ్చేది ఎర. దానికోసం వచ్చి పూర్తిగా చచ్చేది చేప. ఆ చచ్చిన చేపలను అమ్ముకుని సుఖంగా బ్రతికేవాళ్ళు బెస్తవాళ్ళు!'' అని జవాబిచ్చింది గౌరి.

రమణయ్య తన మనవరాలి తెలివితేటలకు ఆనందపడిపోతూ, మహేశాన్ని ''ఇక నీ పరీక్ష అయినట్టేనా..?'' అని అడిగాడు.

మహేశం ''ఇంకొక ప్రశ్న వున్నదండీ..! అని.. గౌరితో మొదటిదాన్ని సేవిస్తేనే బ్రతుకు గడిచేది. రెండవది లేకపోతే ఊళ్ళో కలి ఎవ రింటికి రాదు. మూడవదీ, నాలుగవదీ లేక పోతే బ్రతకలేం. ఎక్కువైతే ఒకదానికొకటి తోడై సర్వనాశనం చేస్తాయి. ఐదోది అనంతం. ఈ ఐదూ ఏమిటో చెప్పండి చూద్దాం..?'' అన్నాడు.

గౌరి, కనీకనిపించని చిరునవ్వుతో తల వంచుకుని, తెలియదన్నట్లుగా తల అడ్డంగా ఊపింది. మహేశం విజయగర్వంతో రమణయ్యకేసి చూస్తూ.. ''నేనూ, మాతాతా గెలిచినట్టేనా..! ఏదీ పందెం?'' అన్నాడు.

రమణయ్య ఏం సమాధానం చెప్పాలో తోచక తికమకపడ్డాడు.

అది గమనించిన మహేశం, ''ఏమీ వద్దు లేండి. మీ గౌరిని మా ఇంటికి కోడలిగా పంపించేయండి చాలు'' అన్నాడు.

ఆ తర్వాత నెల తిరక్కుండా గౌరికి, మహేశానికీ పెళ్ళి జరిగిపోయింది.

అత్తవారింటికి వచ్చాక, ఒకరోజు గౌరి భర్తతో ''మీకొక సంగతి చెప్పాలి!'' అన్నది.

''ఏమిటో చెప్పు'' అన్నాడు మహేశం.

''పెళ్ళికి ముందు నన్ను ప్రశ్నించారే, అది!'' అంటూ గౌరి చిన్నగా నవ్వి, ''మీరు ప్రశ్నించిన ఐదూ, పృథివ్యప్ తేజోవాయు రాకాశాలనే, పంచ మహాభూతాలు. మొదటిదైన పృథివి.. అంటే భూమిని సేవించి పంటలు పండిస్తేనే బ్రతుకు. ఇక రెండవది నీరు. అది లేకపోతే ఊళ్ళో.. కలి అంటే చాకలి ఎవరింటికి రాడు. మూడూ, నాలుగూ.. అగ్ని, వాయువు, గాలీ, నిప్పూ లేకపోతే బ్రతకలేం. ఎక్కువైతే ఒకదానికొకటి తోడై సర్వనాశనం చేస్తాయి. ఐదవదయిన ఆకాశం.. అనంతం'' అంది గౌరి.

మహేశం అంతా విని తెల్లబోయి చూస్తూ.. ''సమాధానం తెలిసి, పెళ్ళికి ముందే ఎందుకు చెప్పలేదు?'' అన్నాడు.

అందుకు గౌరి.. ''మీ తొలి రెండు ప్రశ్నలకూ, నేను సరైన జవాబులివ్వగానే మీరు ఓడిపోతున్నట్లుగా ముఖం పెట్టారు. శత్రువును లొంగదీయాలన్నంత పట్టుదలగా, ఆఖరి ప్రశ్న అడిగారు. అప్పటికే నేను, మీకు నచ్చాననీ, ఇంక మీరడిగే ప్రశ్నలకు జవాబు చెప్పకపోయినా, నన్ను పెళ్ళాడతారనీ, నాకు గట్టి నమ్మకం కలిగింది. అందుకే ఆఖరి ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయినట్టు నటించి, విజయం మీకే దక్కేట్టు చేశాను. తమకంటే, తమ భర్తలే గొప్పవాళ్ళు కావాలనే కదా, మా ఆడవాళ్ళు కోరుకునేది'' అన్నది.

భార్య తెలివికీ, పొంగిపోతూనే.. ''అయితే, ఇంతకూ నేను ఓడిపోయానంటావు!'' అన్నాడు మహేశం. ''ఏమో, గెలిచి ఓడారో, ఓడి గెలిచారో మీకే తెలియాలి!'' అన్నది గౌరి.

మహేశం తృప్తిగా నవ్వుతూ.. ''ఓడి గెలిచాను! పరీక్షలో ఓడి, నిన్ను గెలుచుకున్నాను!'' అన్నాడు. – లక్ష్మీ గాయత్రి





# మంత్రగత్తె కానుకలు

ఒకానొక అడవిలో ఒక కోతి నివసించేది. తాను పుట్టి పెరిగిన ఆ అడవిలో దానికి కావలసినన్ని పళ్ళూ, కాయలూ దొరకడంతో అది తన స్నేహితులతో ఆడుకుంటూ ఉల్లాసంగా గడిపేది.

అయితే రోజులెప్పుడూ ఒకేలా ఉండవు. ఆ ప్రాంతమంతటా నీటికి ఎద్దడి కలగసాగింది. కాలం గడుస్తున్నకొద్దీ వానలు తగ్గిపోయి చెట్లన్నీ మోడులుగా తయారవడంతో కోతికి దొరికే ఆహారం తగ్గిపోతూవచ్చింది. దాని స్నేహితుల సంఖ్య కూడా క్రమంగా తగ్గసాగింది. కొందరు చనిపోగా ఇతరులు కొత్త ప్రాంతాలకు తరలి పోసాగారు. చేసేది లేక కోతి తానుకూడా తన అడవిని వదిలిపెట్టి కొత్త ప్రదేశాలు వెతుక్కుంటూ ఒంటరిగా చాలా దూరం పోవలసివచ్చింది.

కాని దానికి ఎక్కడా అనువైన స్థలం దొరకలేదు. మరికొంత దూరం వెళ్ళాక దానికి చివరకు ఒక కొండప్రాంతం ఎదురయింది. అక్కడ తగినన్ని చెట్లుగాని, నీటి కాలవలుగాని కనిపించలేదు. అప్పటికే చాలా అలసిపోయిన కోతి తనకిక చావు తప్పదని భావించి, అక్కడే కన్నీరు పెట్టుకుంటూ కూర్చుంది.

ఇంతలో అక్కడికి ఎవరో వచ్చిన అలికిడి అయింది. కోతి తల తిప్పి చూసేసరికి అక్కడొక ముసలమ్మ కనబడింది. 'నీవెవరు? ఎందుకిలా ఏడుస్తున్నావు?' అని ముసలమ్మ దాన్ని అడిగింది. కోతి ముసలమ్మకు తన కథ అంతా చెప్పి, గోడు వెళ్ళబోసుకుంది.

'నీ కష్టాలు నేను తీరుస్తాను. నా దగ్గర పనిచేస్తావా?' అని అడిగింది ముసలమ్మ. 'నేనా? నేనేం పని చెయ్యగలను?' అంది కోతి. 'నువ్వు చెయ్యగలిగినదే చెపుతానులే. నాతో రా' అంటూ ముసలమ్మ కోతిని వెంటబెట్టుకుని కొండలోని ఒక గుహలో ప్రవేశించింది.

వెలుతురే లేని ఆ చీకటిగుహలో ఎంతో దూరం నడిచాక వారిద్దరూ దానికి అవతలున్న

కొడవటిగంటి రోహిణీ ప్రసాద్

మరొక బయలు ప్రదేశానికి చేరుకున్నారు. అక్కడ ఎన్నో అందమైన చిన్నచిన్న పూల మొక్కలున్నాయి. వింత ఫలాలు కాయగలి గిన మొక్కలు కూడా ఉన్నాయి. ఆ పక్కనే ముసలమ్మ నివసించే గుడిసె ఒకటి ఉంది.

ముసలమ్మ వాటన్నిటినీ చూపి కోతితో, 'నా అందమైన తోటను చూశావుకదా? ఇక్క డెన్నో మంచి మొక్కలను పెంచుతున్నాను. అయితే వాటిమధ్య కలుపు మొక్కలెన్నో పెర గడంతో నా మొక్కలకు సంరక్షణ లేకుండా పోతోంది. నాకేమో ఓపిక సన్నగిలుతోంది. నీవు కనక నాతో ఉండి ఈ కలుపుమొక్కలన్నీ పీకేసి, తక్కినవాటికి నీరుపెడుతూ ఉంటే నీకు రోజూ కావలసిన ఆహారం నేను పెడతాను. సమ్మతమేనా?' అని అడిగింది ముసలమ్మ.

కోతి సంతోషంగా ఒప్పుకుని వెంటనే పనిలో చేరిపోయింది. పక్కనే ఉన్న సెల యేరునుంచి నీళ్ళు తేవడం, మొక్కలకు పొయ్యడం, కలుపు మొక్కలను ఎప్పటి కప్పుడు శుభ్రం చెయ్యడం కోతి చెయ్యవల సిన పనులు. ముసలమ్మ రెండు పూటలా కోతికి తిండిపెడుతూ ఉండేది.

నిజానికి ఆ ముసలమ్మ ఒక మంత్రగత్తె. ఆ సంగతి కోతికి మొదట్లో తెలియదు. తన కోసం ముసలమ్మ రోజూ భోజనం వండేదని కోతి అనుకునేది. కోరిన తినుబండారాలన్నీ పెట్టే అక్షయపాత్ర వంటిదొకటి ముసలమ్మ దగ్గర ఉందని తరవాత దానికి తెలిసింది.

కోతి ప్రతిరోజూ తోటపని చేసేది. మొక్క లకు పాదులు చేసి నీళ్ళు పొయ్యడం, కలుపు శుభ్రం చెయ్యడం మొదలైనవన్నీ చేస్తూ ఉండేది. తనకు చాకిరీ తప్పడంతో ముస లమ్మ కూడా చాలా సంతోషించింది. కోతి



కిప్పుడు మనుషులతో సహా అన్ని జంతువుల భాషలూ అర్థమవుతున్నాయి. అలాగే తన మాటలన్నీ అందరికీ అర్థమవుతున్నాయి. ఇదంతా మంత్రగత్తె మహిమేనని కోతి తెలు సుకుంది.

అలా కొంతకాలం గడిచాక మొక్కలన్నీ ఏపుగా పెరిగాయి. రానురాను కోతికి తోటలో ప్రతిరోజూ పని చెయ్యవలసిన అవసరం తగ్గింది. మునుపటికన్నా వర్షాలు బాగా పడుతున్నా యని గుర్తించిన కోతికి మళ్ళీ తన పాత అడవి మీద మనసుపోయింది. ముసలమ్మ దయ వల్ల తిండికి లోటు లేకుండా జరిగిపోయినప్ప టికీ కోతి తిరిగి వెళ్ళిపోదామని నిశ్చయించు కుంది. తన మనసులోని ఆలోచనను అది ముసలమ్మకు చెప్పి, ఆమె దగ్గర సెలవు తీసుకుంది.

ముసలమ్మ దానికి వీడ్కోలు చెపుతూ దానికొక బూరానూ, విల్లమ్మునూ కానుకగా



ఇచ్చింది. అవేమిటో అర్థంకాకపోయినప్పటికీ మర్యాదకు వాటిని స్వీకరించి కోతి ముసలమ్మకు నమస్కారం పెట్టింది.

అప్పుడు మళ్ళీ ముసలమ్మ దానితో, 'ఏయ్ కోతీ, అవేమిటనుకుంటున్నావు? వాటికెంతో మంత్రశక్తి ఉంది తెలుసా? ఆ విల్లుతో బాణం వేసినట్టయితే ఎంత పెద్ద జంతువైనా సరే చచ్చిపోతుంది. అలాగే ఆ బూరా కనక ఊదినట్టయితే విన్నవాళ్ళందరూ నాట్యం చెయ్యడం మొదలుపెడతారు. నీవు నాకు చేసిన సహాయానికి ప్రతిఫలంగా వీటిని నీకిస్తున్నాను. ప్రమాదసమయంలో అవి నీకు పనికొస్తాయి. నీవిక క్షేమంగా వెళ్ళు' అన్నది ముసలమ్మ.

కొంత దూరం పోయాక చెట్టుమీద దాక్కుని ఉన్న ఒక పెద్ద కొండచిలువ ఏమరుపాటుగా ఉన్న కోతి మీదికి దూకబోయింది. దాన్ని గమనించిన కోతి ఒక గెంతు గెంతి దూరంగా జరిగింది. అది ముసలమ్మ తనకు కానుకగా ఇచ్చిన విల్లునూ, బాణాన్నీ తీసి కొండచిలువకు గురిపెట్టి కొట్టింది. వాటికి ఉన్న మంత్రశక్తివల్ల బ్రహ్మాండమైన ఆ కొండచిలువ కాస్తా వెంటనే చచ్చింది. అయితే ముసలమ్మ తనకిచ్చినది ఒకటే బాణమనీ, మరే బాణమూ అలా శక్తివంతంగా పనిచెయ్యదనీ కోతికి తెలిసింది. అందుచేత కోతి మళ్ళీ మళ్ళీ ఉపయోగించడానికని మంత్రశక్తి కలిగినటువంటి ఆ బాణాన్ని వెనక్కి తీసుకుంది.

మంత్రగత్తె తనకిచ్చిన కానుకలు సామాన్యమైనవి కావని కోతి గ్రహించింది. మనుషులు కాక ఈ కానుకలను వాడగలిగిన జంతువులు కోతులు మాత్రమేననీ, అందుకే ముసలమ్మ వాటిని తనకిచ్చిందనీ కోతికి అర్థమయింది. 'ముసలమ్మ చెప్పినది నిజమేనన్న మాట. వీటివల్ల నాకు ప్రాణాపాయం తప్పింది. బతుకు జీవుడా' అనుకుంటూ కోతి ముందుకు సాగింది.

మరి కాసేపటికి ఒక కోనలో ప్రవేశించినప్పుడు ఒక ఎలుగుబంటి భయంకరంగా అరుస్తూ కోతిమీద వచ్చి పడింది. విల్లమ్ములు ఉపయోగించే వ్యవధి లేకపోవడంతో కోతి తన బూరాను ఊదసాగింది. దానితో అంత పెద్ద ఎలుగుబంటీ నాట్యం చేస్తూ దాని వెంట రాసాగింది. బూరాలోని మంత్రశక్తి ఎటువంటిదంటే అది మోగుతున్నంతసేపూ తాను చేస్తున్న నాట్యాన్ని ఆపడం ఎలుగుబంటికి సాధ్యం కాలేదు. ఈ విషయాన్ని గ్రహించిన కోతి తన బూరాను ఊదడం ఆపలేదు. కొంతసేపు గడిచాక ఎలుగుబంటికి అలసట కలగడంతో కళ్ళు తిరగసాగాయి. అప్పుడు కోతి దాన్ని ఉపాయంగా ఒక జలపాతంలోకి నెట్టగలి

గింది. అలా ఎలుగుబంటి పీడను వదిలించుకున్న కోతికి మరే అపాయమూ కలగలేదు. ఆ తరవాత కోతి తన బూరానూ, విల్లమ్ములనూ విడిచిపెట్టలేదు.

తాను ఇంతకాలమూ పడ్డ శ్రమకు మంచి ఫలితమే దక్కిందని కోతి భావిస్తూ, మరింత ఉత్సాహంతో తన పాత నివాసానికి ప్రయాణం కొనసాగించింది. మధ్యాహ్నం వేళకు కోతికి దాహంవేసింది. మంత్రశక్తి కలిగిన తన వస్తువులను చెట్టుమీద దాచి, కోతి నీరు తాగడానికని చెట్టు దిగింది. ఇంతలో ఒక భయంకరమైన తోడేలు అరుస్తూ దానిమీద పడింది.. దాన్ని చూడగానే భయంతో వణికిపోయిన కోతి దానితో, 'నావంటి బక్క ప్రాణిని తింటే నీకేం లాభం? నన్ను ప్రాణాలతో వదిలిపెడితే నీకొక కానుక సమర్పించుకుంటాను సరేనా?' అని అడిగింది కోతి.

'ఏమిటా కానుక?' అని అడిగింది తోడేలు దానికేసి అనుమానంగా చూస్తూ. 'అదిగో ఆ బలిసిన అడవిపందిని చూశావా? దాన్ని నీకు ఆహారంగా పెడతాను చూసుకో. ముందు నా విల్లమ్ములను తీసుకోనీ', అంటూ కోతి చెట్టెక్కి తన విల్లమ్ములను తీసుకుంది. తోడేలు తన సమీపానే ఉండడంతో కోతి దాన్నేమీ చెయ్యలేకపోయింది. తోడేలు చూస్తూండగానే కోతి అడవిపందిని తన బాణంతో కొట్టింది. దాంతో అంతలావు అడవిపంది కాస్తా కూలిపోయింది. అది చూసి తోడేలు ఆనందంగా అడవిపందిని ఆరగించసాగింది.

కోతి తన బాణాన్ని మళ్ళీ వెనక్కి తీసుకునేముందు చెట్టెక్కి తన బూరాను తెచ్చుకుని తోడేలు దగ్గరకెళ్ళి ఊదసాగింది. తోడేలు ఆ సంగీతం ప్రభావానికి లోబడి, తినడం మానేసి, నాట్యం చెయ్యసాగింది. అప్పుడు కోతి ఒకవంక బూరా ఊదుతూనే అడవిపందికి తగిలిన తన బాణాన్ని వెనక్కి తీసేసుకుంది. ఆ తరవాత నాలుగడుగులు వెనక్కి వేసి అదే బాణం ఎక్కుపెట్టి తోడేలును కొట్టి చంపేసింది.

ఆ విధంగా తోడేలు బాధను వదిలించుకున్న కోతి ఆ తరవాత తన బూరాకొక తాడు కట్టి తన మెడలోనే వేసుకుని తిరగసాగింది. చాలా రోజులపాటు నడిచాక కోతి తన పాత నివాసస్థలాన్ని చేరుకోగలిగింది.






# సందేశం

విద్యానందుడి గురుకులంలో మధ్యాహ్న భోజనాలు పూర్తయ్యాక, ఆయనకు తన శిష్యులతో కొంతసేపు ముచ్చటించడం అలవాటు. ఆరోజు గురువు తన భోజనం ముగించి ఆశ్రమం బయట అరుగుమీదకు చేరగానే శిష్యులంతా ఆయన ముందు కూర్చున్నారు, విద్యానందుడు శిష్యులకేసి చూస్తూ ''ఈరోజు మనం భోజనంలో స్వీకరించిన పిండిమిరియంలోని కూరలేంటి?'' అని అడిగారు.

వెంటనే ఆనందు అనే శిష్యుడు లేచి ''గురువుగారూ! నేను ఆశ్రమంలో చేరిన రోజున నాటిన అరటిపిలక పెరిగి చెట్టయి గెలవేసి, పక్వానికి రాగా దాన్ని కోశాం. ఆ అరటి కాయ పిండి మిరియమే ఈరోజు మనమందరం భుజించాం.'' అని ఉత్సాహంగా చెప్పాడు. గురువుగారు చిరునవ్వుతో, ''మంచిది ఆనందూ! ఐతే అది పండ్లగెల అనుకుంటానే!'' అన్నారు. ''ఔను గురుదేవా! కానీ బాగా పక్వానికి వచ్చిన కాయలను పండేందుకు దాచి ఉంచి, లేత కాయలను మాత్రమే ఈరోజు వంటలోకి ఇచ్చాము.''

''మరి ఆ చెట్టునేం చేశారు?''

''గురుదేవా! ఒకగెల వేసి దాన్ని కొట్టేశాక అదితిరిగి గెలవేయదు కనుక, దాన్నీ కొట్టేశాం.''

''మరి ఆచెట్టును చెత్తలో పడేశారా!''

''లేదు గురుదేవా! దాని బోదెలోని ఊచను తీసి ఈ రాత్రికి అరటి ఊచకూర చేయను వంటశాలలో అందజేశాం.''

''మరి ఆకులో?''

''గురుదేవా! ఆ ఆకుల్లోనే మనం మధ్యాహ్నం భోజనాలు చేశాం.''

''మరి ఆ బొదెకున్న నార...''

''గురుదేవా! బోదెకున్న నారనంతా తీసి

ఆదూరి హైమవతి

ఉండలుగాచుట్టి ఆరబెట్టాం. దానితో పూలుకట్టి మన పూజా మందిరంలోని దేవుని చిత్రపటాలకు పూలమాలలు అలంకరించేందుకై దాచాం. గట్టిగా మందంగా ఉన్న బెరడును మేము బట్టలు ఉతుక్కనే చోట కాలువలో ఉంచాం, నీరు పక్కకు పోకుండా నేరుగా పూలమొక్కల్లోకి సులువుగా పారుతున్నది. ఇంకా మిగిలిన ఆ తుక్కును, ఓ గొయ్యి తీసి దాన్లో కప్పి ఉంచాం, కొద్దిరోజులకు అది బాగా కుళ్ళి 'పచ్చిరొట్ట' ఎరువుగా మారుతుంది, దాన్ని మన కూరల పాదులకు వేస్తే కూరలు బాగా కాస్తాయి.''

''మంచిది ఆనందూ! మరి అరటిచెట్టు కొట్టిన చోట ఉన్న పిలకలమాటో!''

గురుదేవా! ''ఆ పది పిలకలనూ తీసి వేరువేరుగా నాటాం. కొద్దికాలానికి అవీ తల్లి చెట్టులా గెలవేస్తాయి.''

''చూశారా! పిల్లలూ ! కేవలమొక అరటి పిలక, మనం వాడుకున్న నీటిని స్వీకరించి పెరిగి మనకు గెల, ఆకులేకాక, తన శరీరాన్ని మొత్తం ప్రతిఫలంగా సమర్పించుకుని, తన కృతజ్ఞను తెలుపడమేకాక మనకు త్యాగభావాన్ని గురించి ఎలా తెలిపిందో!

''బ్రతికినన్ని'' నాళ్ళు ఫలము లిచ్చుటెకాదు,
చచ్చికూడచీల్చి ఇచ్చుతనువు
త్యాగభావమునకు తరువులే గురువులు..

అనేది పెద్దలమాట. మనంకూడా ఆ అరటి పిలకలా, మనకు శరీరాన్నిచ్చిన తల్లిదండ్రులకు, మనం ఆకలి తీర్చుకుని పెరిగి పెద్ద కావడానికి నీరు ఆహారం అందించి, మనం నివసించడానికి తనమీద త్రవ్వి ఇళ్ళుకట్టుకున్నా ఓర్పుతో మనకు జీవనాధారమైన 'నేలతల్లికి' కృతజ్ఞత తెలుపడం, ఎవరైనా సరే మనకు కించిత్ ఉపకారం చేసినా వారిపట్ల కృతజ్ఞతా భావంతో మెలగడం మనం నేర్చుకోవలసి ఉందికదా!

''మన్నించండి గురుదేవా! మాకు ఎన్నో మంచిమంచి విషయాలు నేర్పుతూ మంచి మానవులుగా తీర్చిదిద్దుతున్న 'గురువు' గారిపట్లా కృతజ్ఞతగా ఉండాలని మాకు ఆ అరటి పిలక నేర్పింది'' అని నమస్కరించిన ఆనందు తలను ప్రేమతో నిమిరాడు విద్యానందుడు.






# శిథిలాలయం - 9

(కొండగుహలో శిఖిముఖీ, విక్రమకేసరులకు శిథిలాలయ పూజారి కనిపించలేదు. అక్కడ దొరికిన ఎలుగుబంటును వాళ్ళు సవరగండుపోతు ముఠావాళ్ళకు ఒప్పచెప్పారు. నాగుమల్లి దాన్ని కొంతసేపు ఆడించి, ఇవతలికి రాగానే, అది చుట్టూ చేరిన గుంపుమీద విరుచుకుపడింది. దాన్ని పట్టుకునేందుకు శిఖిముఖీ, నాగుమల్లీ పరిగెత్తారు.. తరువాత...)

ఎలుగుబంటు చేత గాయపడిన వాళ్ళల్లో ఎక్కువమంది సవర స్త్రీలూ, పిల్లలూ, మగవాళ్ళు దాన్ని చంపేందుకు ఈటెలూ, కర్రలూ అందుకునేలోపలే ఎలుగు బంటు చేయవలసిన ఘోరం అంతా చేసి పారిపోయే ప్రయత్నంలో ఉన్నది. ఆ దశలో దాన్ని పట్టుకునేందుకు నాగుమల్లీ, శిఖిముఖీ ముందుకురికారు. వాళ్ళు ఎలుగుకేసి పరిగెత్తటం చూసిన సవరలు ఈటెల్ని దానికేసి విసరకుండా ఆగారు. అవి గురితప్పి తమ నాయకుడి కూతురు గ్గానీ, శిఖిముఖిగ్గానీ తగలవచ్చని వాళ్ళు భయపడ్డారు.

ఎలుగుబంటు ఒకసారి రెండుకాళ్ళ మీదా నిలబడి తనను సమీపిస్తున్న నాగు మల్లి మీదికి దూకబోయింది. నాగుమల్లి ఏమీ చలించక పిడికిళ్ళు బిగించి ఉన్న చోటునే నిలబడింది.

ఆసరికి ఎలుగును సమీపించిన శిఖి ముఖి కాలితో బలంగా దాని నడుంమీద ఓ తన్ను తన్నాడు. ఎలుగుబంటు ఆ తాపు వేగానికి గోండ్రిస్తూ కిందపడి చప్పున లేచి అరణ్యంకేసి పరిగెత్తసా గింది.

పీడ విరగడయిందన్నట్టు చూసి, శిఖిముఖి వెనుదిరగబోయాడు. కానీ

దాసరి సుబ్రహ్మణ్యం



అంతలో అతడి దృష్టి మెరుపులా ఎలుగు బంటుకేసి పరిగెత్తుతున్న నాగుమల్లిమీద పడింది. ఇప్పుడామె చేతిలో ఒక ఈటె ఉన్నది. వెనకనుంచి తండ్రి గండుపోతూ, మరికొందరూ ఆగమని కేకలు పెడుతున్నా ఆమె లక్ష్యపెట్టకుండా ముందుకు పరిగెత్తసాగింది.

నాగుమల్లి సాహసం చూసి శిఖిముఖి మనసులో మెచ్చుకున్నాడు. కానీ, ఆమె చేస్తున్నది దుస్సాహసమనీ, ప్రమాదం తెచ్చి పెట్టేదనీ అతడికి తోచింది.

ఆ వెంటనే అతడు మల్లీ! అంటూ కేకపెట్టి ఆమెకేసి పరిగెత్తాడు. ముందు ఎలుగుబంటూ, దానికి కొంచెం వెనుకగా నాగుమల్లీ, ఆమెకు కాస్త దూరంలో శిఖిముఖి పరిగెత్తుతూ, అందరూ చూస్తుండగానే అరణ్యవృక్షాల వెనుక మాయమయ్యారు.

"ఆ ఎలుగుబంటు రూపంలో ఉన్నవాడు పూజారే! సందేహంలేదు. ఆ పూజారి కుక్క, మంత్ర తంత్ర విద్యల్లో సాటిలేనివాడు. శివాలూ! వాడు నా కూతుర్నీ, నీ కొడుకునూ చంపటానికో లేక ఎత్తుకుపోవటానికో, ఈ మాయా రూపంలో వచ్చాడు. ఇద్దర్నీ సమ్మోహపరిచి వెంట తీసుకుపోయాడు. ఇప్పుడేం చేయటం?" అంటూ గండుపోతు అరవసాగాడు.

శివాలుడికి పూజారి శక్తిసామర్థ్యాల్లో గండుపోతుకున్నంత గుడ్డి నమ్మకం లేదు. ఎలుగుబంటును తరుముతూ తనకొడుకూ, గండుపోతు కూతురూ పరిగెత్తటంలో అతడికి పూజారి సమ్మోహన విద్య ఏమీ ఉన్నట్టు అనుమానం కలగలేదు. కానీ, వాళ్ళిద్దరూ ఒకసారి కీకారణ్యంలో జొరబడిన తరువాత ఆ దుర్మార్గుడి నుంచి ఎలాంటి ప్రమాదమైనా సంభవించవచ్చని అతడికి కొంచెంగా భయం కలిగింది.

శివాలుడు ఏమి చేయటమా అని ఆలోచించేంతలో విక్రమకేసరి ముగ్గురు శబరులతో అతణ్ణి సమీపించి, "శివాలూ..! నేను వెంటనే శిఖిముఖికి సాయం వెళతాను. అతడికి ఎలుగుబంటు నుంచి ప్రమాదం వస్తుందని కాదు నా భయం. ఆ శిథిలాలయ పూజారి ఈ చుట్టుపక్కల అరణ్యంలో ఎక్కడో మాటేసి ఉంటాడని నా నమ్మకం" అన్నాడు.



కేసి పరుగుతీశాడు. వాళ్ళు అరణ్యం చేరగానే శిఖిముఖీ.. శిఖిముఖీ అంటూ కేకలు ప్రారంభించారు. కానీ, జవాబు రాలేదు. వాళ్ళల్లో కొందరు అడుగుజాడల కోసం నేలమీద వెతకటం ప్రారంభించారు.

ఆ ప్రాంతాలకు చెందిన అడవి జంతువులూ, మనుషులూ నడిచిన కాలి గుర్తులు అనేకం వారి కంటబడినాయి. కానీ నాగుమల్లీ, శిఖిముఖుల కాలి గుర్తులు వాటిల్లో ఏవో తెలుసుకోవటం ఎలా..?

''ఎలుగుబంటు వాళ్ళిద్దర్నీ అరణ్యంలో చాలా లోపలికి తీసుకుపోయినట్టుంది. మనం రెండు ముఠాలుగా చీలి వెతకటం వల్ల ప్రయోజనం ఉండొచ్చు'' అన్నాడు కేసరి. ఆ వెంటనే ఇద్దరిద్దరు ఒక జట్టుగా బయలుదేరి అరణ్యంలో కేకలు పెడుతూ శిఖిముఖీ, నాగుమల్లి కోసం వెతకసాగారు. కానీ, నాగుమల్లీ, శిఖిముఖులు ఆ ప్రాంతాల్లో ఎక్కడా లేరు.

తన కులంవాళ్ళను గాయపరిచింది గనుక, ఎలుగును పట్టుకుని చీల్చిచెండాడాలన్న కోపంతో నాగుమల్లి దాన్ని వదలకుండా వెంటబడి తరమసాగింది. తమ కాతిథ్యం ఇస్తున్న గండుపోతు కూతురు ఎక్కడ ప్రమాదంలో చిక్కుకుంటుందేమో అని శిఖిముఖి ఆమెను వెన్నంటి పరిగెత్తసాగాడు. పైగా, ఆ ఎలుగుబంటును కొండగుహదగ్గిర పట్టుకుని సవర పల్లెకు చేర్చింది తను...

''నేనూ అదే అనుకుంటున్నాను, కేసరీ! వాణ్ణి, నాగుమల్లినీ కనబడినవాళ్ళను కనబడినట్టు ఇక్కడికి లాక్కురండి'' అన్నాడు శివాలుడు.

''నేను వద్దని కేకలు పెడుతున్నా పరిగెత్తింది నాగు. నేను వెంటనే తిరిగి రమ్మన్నానని చెప్పండి'' అని గండుపోతు విక్రమకేసరితో చెప్పి, అతడు బయలుదేరి పోబోతుండగా భుజంపట్టుకు ఆపి.. ''ఆ ఎలుగ్గొడ్డుందే.. అది పూజారే అని నా అనుమానం. అది దొరికితే ప్రాణాలతో కాకుండా చంపి, చర్మం వలుచుకువస్తే సరిపోతుంది. ఆ చర్మాన్ని ఎండగట్టి, నా ఇంటి గడప దగ్గిర కాళ్ళు తుడుచుకునేందుకు ఉపయోగిస్తాను'' అన్నాడు.

విక్రమకేసరి అతడి మాటలకు సరే అని తలూపి, అనుచరులతో అరణ్యం

శిఖిముఖి ఇలా ఆలోచిస్తూ ఎలుగు బంటూ, నాగుమల్లిల వెనక కొండ లోయలో ఉన్న అరణ్యంలోకి చాలా దూరం పరిగెత్తాడు. చివరకు ఎలుగు బంటు బాగా అలసిపోయినట్టుంది. అది ఒక టేకుమాను పక్కన నిలబడి కోరలు చాస్తూ, చిన్నగా గోండ్రించ సాగింది. నాగుమల్లి ఒగర్చుతూ దాన్ని సమీపించి చేతిలోని ఈటెతో దాని గుండెలమీద పొడవబోయింది. కానీ, ఎలుగుబంటు ఆ దెబ్బ తప్పుకుని మాను వెనకకుపోయి భీకరంగా గోండ్రిస్తూ నిల బడింది.

ఆ సమయంలో శిఖిముఖి, నాగు మల్లిని సమీపించాడు. నాగుమల్లి అతడి రాకను చూసీ, చూడనట్టు తల పక్కకు తిప్పుకుని ఎలుగుబంటిమీద ఈసారి ఈటెతో కలియబడేందుకు, దానికేసి ఒక్కొక్క అడుగే వేయసాగింది.

"మల్లీ.. దానికి మరీ దాపులకు వెళ్ళకు. పారిపోయే ఆశ లేనప్పుడు క్రూరమృగం ఎంత సాహసం చేయగలదో, నీకు తెలీదా?'' అన్నాడు శిఖిముఖి.

"ఆహా.. తెలీదు! శబరకు(రాడొచ్చి చెబితే తప్ప, ఏది ఎలుగుబంటో, ఏది ఎలకపిల్లో కూడా నాకు తెలీదు'' అని వెటకారంగా అంటూ నాగుమల్లి తల తిప్పి శిఖిముఖికేసి చూడబోయేంతలో, అదే అవకాశంగా తీసుకుని ఎలుగు బంటు ఆమె మీదికి దూకింది. కానీ, అది మీదికి దూకబోయేముందు పెట్టిన గుర్రుధ్వని వింటూనే నాగుమల్లి ఈటెను రెండు చేతుల్తో దాని గుండెలకేసి బలంగా ఊపింది. ఈటె ఎలుగు గుండెల్లో గట్టిగా





పొడుచుకుంది. కానీ, అది ఎగిరి మీద బడ్డ వేగానికి నాగుమల్లి కాలు నిలదొక్కు కోలేక వెనక్కు పడిపోయింది. ఎలుగు బంటి ఆమె తలను గావుపట్టు పట్టేం దుకు పెద్దగా నోరు తెరిచింది.

శిఖిముఖి నడుంనుంచి వేలాడుతున్న చురకత్తిని చర్రునలాగి, మెరుపులా ఎలుగుబంటు మీదికి దూకి, ఎడంచేత్తో దాని కంఠాన్ని వెనక్కు లాగుతూ, అదే ఊపులో కుడిచేతిలో వున్న చురకత్తిని బలంగా దాని మెడమీద గుచ్చి నరాలు తెగేట్టుగా మెలితిప్పాడు. ఎలుగుబంటు నాగుమల్లిని వదిలి పెద్దగా గోండ్రిస్తూ, శిఖిముఖి మీద విరుచుకుపడింది. శిఖి ముఖి ఒక చేత్తో ఎలుగుబంటి మెడను గట్టిగా పట్టుకుని, దాని వాడి కోరలకు తన తల దొరక్కుండా చూసుకుంటూ, చుర కత్తితో దాని శరీరం మీద అందిన చోట నల్లా బలంగా పొడవసాగాడు.

ఈలోపల నాగుమల్లి లేచి నిలబడింది. ఆమెకు శిఖిముఖి మీద తన తండ్రిని కొట్టి గాయపరిచాడన్న పగా, కోపం ఉన్నా, ఈ సమయంలో అతడు తనను రక్షించేం దుకు ప్రయత్నించి ఎలుగువల్ల ప్రమాదం తెచ్చుకున్నాడన్న గ్రహింపు కలిగింది. వెంటనే ఆమె ఎలుగుబంటు శరీరంలో దిగి ఉన్న తన ఈటెను ఒక గుంజు గుంజి బయటికి లాగి, దానితో ఎలుగు డొక్కలో ఇటునుంచి అటు దూసుకుపోయేట్టుగా ఒక్కపోటు పొడిచింది. ఎలుగుబంటి ఒకసారి పెద్దగా గోండ్రించి, వెల్లికిలా పడి గిలగిలా తన్నుకోసాగింది.

శిఖిముఖి లేచి నిలబడ్డాడు. అతడి శరీరంమీద అక్కడక్కడా ఎలుగుబంటు వాడి గోళ్ళవల్ల చిన్న చిన్న గాయాలై కొద్దిగా నెత్తురు కారుతున్నది. అతడి కుడిచేతిలోని చురకత్తి రక్తం ఓడుతున్నది.

నాగుమల్లి అతణ్ణి నఖశిఖ పర్యంతం ఓసారి పరీక్షగా చూసి చిరునవ్వు నవ్వ బోయి అంతలోనే ముఖంమీద చిరు కోపం కనబరుస్తూ.. ''అంత చిన్న కత్తితో ఎవరైనా ఎలుగుబంటుమీద కలియబడ తారా? మీ శబరకులం వాళ్ళల్లో ధైర్య సాహసాలున్నాయ్యేమోగానీ, యుక్తినేర్పు ల్లాంటివి కనబడవు. నీకేమైనా ప్రమాదం జరిగి ఉన్నట్టయితే, అందుక్కారణం నేనేనా, మీ తండ్రి మామీద దొమ్మీ చేసి ఉండేవాడు'' అన్నది.

‘‘యుక్తులూ, కుయుక్తులూ మనుషులమీద పారినంత తేలికగా, క్రూర మృగాలమీద పారవు. నిన్ను చంపబోతున్న ఎలుగును ఏ యుక్తీ నేర్పూ ఉపయోగించి నేను విడిపించగలిగేవాణ్ణి? ఆ క్షణంలో నా దగ్గిర ఈ చిన్న కత్తి కూడా లేకపోతే, వట్టి చేతులతోనే దాని మీద కలియబడి ఉండేవాణ్ణి’’ అన్నాడు శిఖిముఖి.

నాగుమల్లి ఆ మాటలకు కొంచెంగా ఆశ్చర్యపోయి, ‘‘నీ శత్రువు కూతురు ప్రాణాలు కాపాడేందుకు అంత సాహసం చేసేవాడివా?’’ అని అడిగింది.

‘‘గండుపోతు నాకు శత్రువు కాదు. ఏ పరిస్థితుల్లోమేం ఇద్దరం ఈటెలు తీసుకుని పోట్లాడుకోవలసి వచ్చిందో, ఆ సంగతి మీ వాళ్ళకూ, మావాళ్ళకూ కూడా బాగా తెలుసు. జరిగిపోయిందాన్ని గురించి ఇప్పుడు వాదోపవాదాలెందుకు? గాయాలకు ముందు ఆకుపసరు పూయాలి. నీవూ బాగా గాయపడ్డావు. వాటినుంచి తీపూ, సలపరం మొదలవకముందే ఆకురసం తెచ్చి పూసుకో. నెత్తురు కట్టించి గాయాన్ని మాన్పే ఔషధీ పత్రాలేవో గుర్తించి తెచ్చుకోగలవా? లేక నేను కోసుకొచ్చి పెట్టనా?’’ అంటూ శిఖిముఖి చుట్టూ ఓమారు కలియజూసి, మహావృక్షాలకు దిగువున అల్లిబిల్లిగా పెరిగిన పొదలకేసి బయలుదేరాడు.

నాగుమల్లి అతణ్ణి ఆగమని హెచ్చరించి, ‘‘నేనూ అరణ్యంలో పుట్టి పెరిగిన



దాన్నే. మందుకు పనికొచ్చే ఆకులేవో నాకు తెలియనివి కావు. వాటిని నీక్కూడా నేనే తెచ్చి ఇస్తాను. మావాళ్ళు అన్నట్టు ఈ చచ్చిన ఎలుగుబంటు ఆ దొంగ పూజారేనేమో! లేచి పారిపోకుండా చూస్తూండు’’ అంటూ చిరునవ్వు నవ్వి చెట్లలోకి పోయి, నాలుగైదు నిమిషాల్లో ఇన్ని ఆకులు గుప్పెళ్ళతో పట్టుకు వచ్చింది.

నాగుమల్లి తిరిగి వచ్చేసరికి, శిఖిముఖి ఒక ఎండు మోడుమీద కూర్చుని ఆమెను గురించే దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. నాగుమల్లి కనబరిచిన ధైర్యసాహసాలేగాక, ఆమె అందచందాలు కూడా అతడి హృదయాన్ని బాగా ఆకర్షించాయి.

‘‘ఏమిటి అంత ఆలోచన? ఇదుగో ఆకురసం..!’’ అంటూ నాగుమల్లి శిఖి

ముఖిని సమీపించింది. అతడు ఉలిక్కి పడి నిద్రలేచినట్లు ఆమెకేసి చూసి, చేయి చాపాడు. కానీ నాగుమల్లి ఆకుల్ని అతడి కివ్వక ''వీపుమీదా, భుజాలమీదా కూడా ఎలుగు గోళ్ళతో బాగా రక్కింది. అక్కడ పసరు రాసుకోవటం నీవల్ల ఏమవు తుంది? నేరాస్తాను'' అంటూ శిఖిముఖి గాయాలమీద ఆకు నలిపి దాని పసరు పూయసాగింది.

శిఖిముఖి పసరు తగిలినప్పుడల్లా భగ్గుమని మండే గాయాల బాధ మరచి పోయి, ఆమె ముఖంకేసి చూస్తూ ఉండి పోయాడు. పసరు రాయటం పూర్తవగానే నాగుమల్లి అతణ్ణించి కొంచెం ఎడంగా పోయి తన శరీరంమీది గాయాలకు పసరు రాసుకోబోయింది. కానీ, శిఖిముఖి చప్పున లేచి ఆమె దగ్గరకుపోయి, చేతిలో ఉన్న ఆకుల్ని లాక్కునేందుకు ఆమె గుప్పెళ్ళను బలంగా పట్టుకుని, ''నాకు నువ్వు చెప్పిందే, నీకూ చెల్లుతుంది. ఇప్పుడు వంతు నాది'' అంటూ ఆమె ఇచ్చిన ఆకుల్ని మరికాస్త రసంవచ్చేలా అరచేతుల్తో నలిపి, ఆమె శరీరంమీద దెబ్బలు తగిలినచోటల్లా రాయసాగాడు. నాగుమల్లి లేని బాధను కనబరుస్తూ చిన్నగా మూలుగులు ప్రారంభించింది.

ఈ స్థితిలో లోయపైనున్న కొండభాగం మీది గుబురు చెట్లల్లోంచి ''నా బిడ్డ ల్లారా..! అహ్హహ్హ!'' అన్న వికృత కంఠధ్వని వినిపించింది. శిఖిముఖీ, నాగుమల్లీ తలలు ఎత్తి పైకి చూశారు.

''మిమ్మల్నిద్దరినీ హిమాలయాలకు అటూ ఇటూ నూరు యోజనాలవరకూ మహారాజూ, మహారాణిలను చేయబోతు న్నాను. ఇడుగో, నా దూత మీ దగ్గిరికే వస్తున్నాడు. వాడిద్వారా నా సందేశం సర్వం తెలుసుకోండి..'' అంటూ వికృత కంఠం మరోసారి పలికింది. తలలు ఎత్తి నిశ్చేష్టులై చూస్తున్న శిఖిముఖీ, నాగు మల్లిలకేసి చెట్లకొమ్మల మీదుగా ఒక మానవాకారం, ఎగురుతున్న పక్షిలా చేతులుచాచి కిందికి దిగసాగింది.

(ఇంకా వుంది)



క్రిస్మస్ జానపద గాథ

# సిగ్గరి బాలుడు

నికోలస్ చిన్నవయసులోనే తల్లిదండ్రులు మరణించారు. కానీ వారు అతడికి పెద్ద సంపద కట్టబెట్టే వెళ్లారు. అయితే నిక్ తన ఈడు పిల్లలతో పోలిస్తే కాస్తా భిన్నంగా ఉండేవాడు. వారసత్వపరంగా వచ్చిన సంపదను ఏం చేసుకోవాలో అతడికి తెలీదు. ఎందుకంటే అతడికి డబ్బుపై పెద్దగా ఆసక్తి ఉండేది కాదు. పేదలంటే అతడికి చాలా విచారమూ, బాధా కలిగేవి.

ఒక సాయంత్రం అతడు పచార్లు చేస్తూ ఆ ఉదయం పూట తనకు అనూహ్యంగా దొరికిన నిధిని ఏం చేయాలని ఆలోచనలో పడ్డాడు. ఉదయం తన గదిలోని కప్‌బోర్డ్‌ను తెరిచినప్పుడు దాంట్లోంచి సంచీడు బంగారు నాణేలు గలగలా రాలిపడ్డాయి. వాటిని ఏం చేయాలని అతడు ఆలోచిస్తూండగానే తన ఇంటికి సమీపంలోని చిన్న గుడిసెలోంచి సన్నగా ఏడుపు వినిపించింది. అతడు నడక ఆపాడు. గుడిసె పక్కన ఉన్న చెట్టు వెనుక దాగి లోపలినుంచి వస్తున్న మాటలను వినసాగాడు.

''ఎలిసా పెళ్లి ఏర్పాట్లను మనం ఎలా చేయగలం? మన ఇంట్లో ఉండే ఆడపిల్లలకు సరైన తిండి కూడా పెట్టలేని దరిద్రులం'' అంటూ వెక్కుతూ చెప్పిందో మగ స్వరం.

''పెళ్లి విందు చాలా ఖర్చుతో కూడుకున్నది! మనం ఏమాత్రం భరించలేము!'' అని ఆడగొంతు వినిపించింది. ''ఎలిసా! నయాపైసలేని మావంటి తల్లిదండ్రుల ఇంట్లో పుట్టడం నువ్వు చేసుకున్న దురదృష్టం తల్లీ!'' అంటూ ఏడ్చాడు తండ్రి.

నిక్‌కి ఆ రాత్రి ముద్ద దిగలేదు. ఆ గుడిసెలోని స్త్రీ పురుషులు చాలా పేదవారులాగా కని





పిస్తున్నారు. ఇప్పుడు ఆ ఇంట్లో పెద్ద కూతురు పెళ్లీడు కొచ్చినట్లుంది. కాని వారి చేతిలో ఏగాని డబ్బు లేదు. అందుకే ఆమెకు వచ్చిన మంచి పెళ్లి ప్రతిపాదనను వారు తిరస్కరించవలసి వస్తోంది. నిక్ బరువెక్కిన హృదయంతో ఇంటికి వెళ్లాడు. అతడికి తక్షణం మనసులో ఒక ఆలో చన స్ఫురించింది. ఆ పేదకుటుంబానికి తన సంపదలో కొంత భాగం ఇస్తే ఎలిసా పెళ్లి సజా వుగా జరిగిపోతుంది కదా!

నిక్ బాగా సిగ్గరి. తాను మేలు చేసినందుకు గాను ఎవరయినా కృతజ్ఞతలు తెలియచేస్తే కూడా అతడి ముఖం ఎర్రగా కందిపోతూం టుంది. అందుకే ఈ దఫా తాను చేయదలి చిన సాయాన్ని రహస్యంగా చేయాలనుకు న్నాడు. ఆ నాటి రాత్రి నిక్ బంగారు నాణేల సంచితో ఇంటినుంచి బయటపడ్డాడు. ఆ పేదవాడి ఇంటికి వెళ్లాడు. ఇల్లంతా చీకటిగా ఉంది. ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు. నిక్ చివరకు తెరిచి ఉన్న కిటికీని చూశాడు. ఒక్కసారిగా తన వద్ద ఉన్న బంగారు నాణేల సంచీని ఆ కిటికీ గుండా లోపలకు విసి అక్కడ నుంచి పరుగెత్తిపోయాడు.

మరునాడు ఉదయాన్నే ఆ ఇంటి పెద్ద నిద్రలేచి తమ ఇంట్లో బంగారు నాణేల సంచీని చూసి ఆశ్చర్యపోయాడు. చుట్టు పక్కల విచారించాడు కాని ఆ సంచీ తన ఇంట్లోకి విసిరింది ఎవరో కనిపెట్టలేకపోయాడు. తర్వాత వారు తమ పెద్దకూతురు పెళ్లి ఘనంగా జరి పించారు. కొన్నాళ్లకు ఆ ఇంట్లో రెండో కూతురు పెళ్లీడు కొచ్చింది. నిక్ మళ్ళీ రహస్యంగా వారి ఇంట్లో బంగారు నాణేల సంచీ విసిరివేసి చక్కా పోయాడు. ఇలా రెండో కూతురు పెళ్లి కూడా నిర్విఘ్నంగా జరిగింది.

చివరకు ఆ ఇంట్లో చిన్న కూతురు పెళ్లికి సమయం వచ్చేసింది. అయితే ప్రతి పెళ్లి సందర్భంలోనూ తమకు అజ్ఞాతంగా సహాయం చేస్తున్న ఆ దాత ఎవరో కనిపెట్టి ఆ ఇంటిపెద్ద కృతజ్ఞతలు తెలియ జేయాలని అనుకున్నాడు. అతడు ఆరోజునుంచీ తన ఇంటి బయటి వైపు ఓ కన్నేసి ఉంచాడు.

ఒక రాత్రి వేళ అతడి నిరీక్షణ ఫలించింది. యధాప్రకారం నిక్ బంగారు నాణేల సంచీతో అక్కడికి వచ్చాడు. అతడిని గమనించగానే ఆ ఇంటిపెద్ద ఒక్కసారిగా అతడి ముందుకు వచ్చాడు. ''ఇన్నాళ్లకు నిన్ను పట్టేశాను,'' అంటూ సంతోషంతో అరిచాడు. వెంటనే నైక్ అక్కడినుంచి పరుగెత్తాడు. సిగ్గుతో అతడి ముఖం కందిపోయింది.

నిక్ వెంబడే పరుగెత్తిన ఆ ఇంటి పెద్ద ఎట్ట కేలకు అతడిని పట్టుకున్నాడు. తీరా తనకేసి చూస్తే లేలేత కుర్రాడు. ''ఇంత కుర్రవా డివా? అయినా నీదెంత సహాయ గుణమో మరి!'' అంటూ అతడు ఆశ్చర్యపోయాడు.

''దయచేసి నేను మీకు సహాయం చేసిన విషయం ఎవ్వరికీ చెప్పవద్దు,'' అంటూ నిక్ గింజుకుంటూ బతిమాలాడాడు. "ఎందుకు? ప్రపంచం నీ గురించి ఎందుకు తెలుసుకో కూడదు?'' అంటూ ప్రశ్నించాడు ఆ ఇంటి పెద్ద. "వద్దు.. వద్దు.." ఆ అబ్బాయి ఉన్నట్లుండి అరిచాడు. మహా సిగ్గుపడిపోతూ, ''మీకు సహాయం చేసింది నేనే అనే విషయం ఎవరికీ చెప్పరు కదూ!'' అన్నాడు. చివరకు అమ్మాయిల తండ్రి నిక్ కోరికను అంగీకరించాడు.

నిక్ ఎదిగేకొద్దీ చర్చ్ పట్ల బాగా ఆకర్షితుడయ్యాడు. తన సంపదనంతా అప్పగించి, చర్చిలో బోధకుడిగా చేరాడు.

పొరుగూరు మైరా లోని చర్చి బిషప్ చనిపోయినప్పుడు ఆ పదవికి అర్హులుగా ప్రతిపాదించబడిన వారిలో నిక్ పేరు కూడా ఉంది. అర్హులైన అభ్యర్థులందరూ మైరాలో చేరారు. బిషప్‌ను మరుసటిదినం ఎన్నుకుంటున్నట్లు ప్రకటించారు. మరుసటి దినం ఉదయాన్నే మైరాలోని చర్చి వద్దకు నిక్ వెళ్లాడు. చర్చి లోపల ఒకే ఒక్క ముదుసలి ఉన్నాడు.

''ఎవరమ్మా నీవు?'' అని అతడు కుర్రాడిని ప్రశ్నించేడు.

''నేను నికోలస్‌ని. ప్రభువు సేవకుడిని.'' అని సమాధానమిచ్చాడు నిక్.

ఆ తర్వాత బిషప్‌గా ఎన్నికయ్యే అవకాశం కోసం ప్రయత్నిస్తున్న వారంతా చర్చికి వచ్చేసరికి, ఆ పాత ముదుసలి ముందుకు వచ్చాడు. ''ఈరోజు చర్చికి మొట్టమొదటి సారిగా వచ్చేవాడే ఈ చర్చికి బిషప్ కావాలంటూ గత రాత్రి నాకు కల వచ్చింది. ఈరోజు పెందలాడే చర్చికి వచ్చాను. చర్చిలోకి మొదటగా ప్రవేశించింది నికోలస్ అనే కుర్రాడు. ఇతడినే మైరా బిషప్‌గా ప్రకటించాలని ప్రతిపాదిస్తున్నాను,'' అన్నాడు.

ఈవిధంగా పటారా గ్రామంలో అవసరమైన వారికి బంగారు నాణేల సంచులను అందించిన యువ నిక్ ఇప్పుడు మైరా బిషప్ అయిపోయాడు.

సంవత్సరాలు గడిచాయి. మైరా గ్రామ బిషప్ నికోలస్ పేరు ప్రపంచమంతటా ప్రసిద్ధికెక్కింది. దయాళువుగా, కృతనిశ్చయుడిగా, ప్రభువు నిజమైన సేవకుడిగా ఇతడు పేరు గాంచాడు. అతడి పేరు ప్రఖ్యాతుల దశదిశలా వ్యాపించాయి. నిక్, నికోలస్, సెయింట్ నికోలస్, శాంతాక్లాజ్..! ఈ పదాలన్నీ ఒకే స్వరాన్ని స్ఫురింపించలేదూ.. నిక్ అంటే ఇతడే మరి.



# అంకురోద్గమ

## బాలవాణి

ప్రియమైన బాల పాఠకులారా,

గత కొద్ది నెలలుగా వివిధ రాష్ట్ర ఎన్జీవోలు, పౌర సమాజ సంస్థలు మరియు యునిసెఫ్ మద్దతు కలిగిన 7000 మంది పటిష్టమైన బాల విలేకరుల యంత్రాంగానికి చెందిన బాలవాణిని మీరు చదువుతూ వస్తున్నారు. ఈ నెల మీకోసం ఒరిస్సా రాష్ట్రం కోరాపుట్ జిల్లా నుండి మరొక 'అంగుర్‌దోమ' సంచికను తీసుకువస్తున్నాము. సమాజంలో వెనుకబడిన వర్గాలకు చెందిన మీ వయసు పిల్లలే రాసిన ఈ కథనాలను చదివిన తర్వాత మీరు వెలిబుచ్చే అభిప్రాయాలకోసం మేం ఎంతోఆసక్తిగా ఎదురు చూస్తుంటాము. – మీ దీదీ




## మన సమాజం

ప్రజలు అడవులను నరికివేస్తున్నారు. దీంతో అడవులనుంచి వనరులను పొందడం కష్టసాధ్యమవుతోంది. చెట్లను నరికివేత వలన వర్షాలు తగ్గిపోతున్నాయి. గతంలో మనం సమృద్ధిగా వర్షాలు, పంటలను చవిచూసేవాళ్లం. శిశువు పుట్టినప్పుడల్లా ఒకమొక్కను నాటవలసిందిగా ప్రభుత్వం కూడా మనలను కోరుతోంది. మన జన్మదిన సందర్భంగా తలా ఒకమొక్కను నాటుదాం రండి.

– డేనియల్ కోర్నియా, జేపోర్ బ్లాక్

మా గ్రామంలో చాలామంది ప్రజలకు వృద్ధాప్య ఫించన్ సరిగా అందడం లేదు. వీరికి బీపీఎల్ కార్డ్ లేదు కాబట్టి వారికి రూ. 2లకు కిలో బియ్యం కూడా అందదు. ప్రభుత్వం ఈ

సమస్య పట్ల దృష్టి సారించవలసి ఉంది. – సుభద్రా నాయక్, బోయ్‌పరిగూడ మండలం

ఈ రోజుల్లో, చాలామంది ప్రజలు తమ స్వంత బాధ్యతలను నెరవేర్చరు గాని ఇతరులను ఏమార్చడంలో తలమునకలై ఉంటారు. వారు తమ ఉనికిని మరుగుపర్చి తాము వికలాంగులం అన్న చందాన వ్యవహరిస్తుంటారు. పైగా, ఉద్యోగాలిప్పిస్తామని వాగ్దానం చేసి ఇతరులను మోసగించే వారు కూడా ఉంటున్నారు. ఇలా వీరు తమ జీవితాన్ని నెట్టుకొస్తుంటారు. బాల విలేకరిగా నేను, ప్రతి ఒక్కరూ నిజాయితీగా పనిచేయాలని, బాధ్యతాయుతమైన జీవితం గడపవలసి ఉంటుందని చెప్పాలనుకుంటున్నాను. – మధుస్మిత, బోరిగుమ్మ మండలం

మా గ్రామాన్ని ఆనుకుని చికపారా అనే గ్రామం ఉంటోంది. ఆ గ్రామంలో సారాయి అమ్ముతుంటారు. చాలామంది వ్యక్తులు తాగి వచ్చి వారి భార్యలను బాదుతుంటారు. ఆ గ్రామంలో వివిధ వర్గాల ప్రజలు నివసిస్తుంటారు. వీరు అన్ని పండుగలనూ కలిసే చేసుకుంటూంటారు. కాని గ్రామంలో అశాంతి ఉంటోందంటే సారాయే దానికి ఏకైక కారణం. పండుగపూట పూటుగా తాగి కొట్టుకునే వారిని చూస్తే నాకు చాలా బాధగా ఉంటుంది. ఆ గ్రామంలో సారాయి అమ్మకాన్ని నిలిపివేయాలని నేను సూచిస్తున్నాను.

– జీతు మచ్చా, సెమిలిగూడ మండలం

## సమిష్టి చర్చ

మా ప్రాంతంలోని బాల విలేకరులందరం కలిసి మా సమాజంలోని సమస్యలను చర్చించాలని కూర్చున్నాము. మా పాఠశాలకు వెళ్లుతున్నప్పుడు దారిలో వంతెన అడ్డు వస్తుంది. దాన్ని దాటే మేం బడికి వెళ్లవలసి ఉంటుంది. ప్రజలతో పాటు అనేక వాహనాలు కూడా ఆ వంతెనను ఉపయోగిస్తుంటాయి. కొన్నాళ్ల క్రితం ఆ వంతెన కూలిపోయింది. ఇప్పుడు మా పాఠశాల విద్యార్థులు చాలా సమస్యలు ఎదుర్కొంటున్నారు. వాహనాలు ప్రయాణించనందున, ప్రతి ఒక్కరూ ఇప్పుడు నడిచే బడికి వెళ్లాలి. వర్షాల కారణంగా మా ప్రాంతంలోని అనేక రహదారులు పాడైపోయాయి. మా చర్చల్లో భాగంగా, ఇతర ప్రాంతాల పిల్లలు కూడా ఈ సమస్య గురించి మాకు చెప్పారు. నారాయణపట్నంలోని పలు రహదారులు కూడా పాడైపోయాయి. మేం దీనిపై మా పెద్దలతో మాట్లాడినప్పుడు దీనిని పదేపదే ఎదురవుతున్న సమస్యగా చెప్పారు. వర్షాలు కురిసిన తర్వాత ప్రతి సంవత్సరమూ రహదారులకు చిన్నా చితకా మరమ్మతులు చేస్తుంటారని, వచ్చే సంవత్సరం వానలకు ఇవి మళ్లీ పాడవుతుంటాయని గ్రామంలోని పెద్దవారు చెప్పారు.

కాబట్టి మా టీచర్ల సాయంతో ఈ సమస్యలను అధికారుల దృష్టికి తీసుకుపోవడానికి నిర్ణయించుకున్నాము. మనందరం కలిసికట్టుగా వంతెన మరమ్మతులను చేయాలని మా గ్రామ పెద్దలకు చెప్పడానికి నిర్ణయించుకున్నాము కూడా.

– బాల విలేకరుల క్లబ్, నారాయణ పట్నం మండలం

# విద్య

మా పాఠశాలలో 200మంది పిల్లలు చదువుకుంటున్నారు. మా బడిలో ఒకటినుంచి ఏడవ తరగతి వరకూ చదివే పిల్లలు ఉంటున్నారు. అయితే మా బడిలో ముగ్గురు టీచర్లు మాత్రమే ఉంటున్నందున చదువు చెప్పడం, వినడం అటు టీచర్లకు, ఇటు పిల్లలకూ కష్టంగా ఉంటోంది. ఇంకో ప్రధాన సమస్య ఏమిటంటే మాకు ఇంకా పుస్తకాలు అందలేదు. ఉపాధ్యాయులు పాఠం చెప్పినా సరే పుస్తకాలు లేకుండా వాటిని మేము అర్థం చేసుకోలేము కదా. కాబట్టి కనీసం మా బడికి ఇద్దరు టీచర్లను, పుస్తకాలను అందజేయవలసిందిగా నేను ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నాను. – సుస్మితా పాణిగ్రాహి, కోట్‌పాడ్ మండలం




మా గ్రామంలోని ప్రజలు చేతి పనులు చేసుకుని బతుకు సాగిస్తున్నారు. కాని రెక్కలు ముక్కలు చేసుకుని వారు సంపాదించేదాన్ని మొత్తంగా జూదంలో తగలబెట్టేస్తుంటారు. వీరి పిల్లలు కూడా మధ్యాహ్న భోజనంలో గుడ్డు ఉన్నప్పుడే బడికి వస్తుంటారు. మేం వారితో ఈ విషయం ప్రస్తావిస్తే మమ్మల్ని తిట్టి వారు చక్కగా ఇండ్లకు వెళ్లిపోతారు. తమ పిల్లలను బడికి పంపని తల్లిదండ్రులకు ఎలాంటి ప్రయోజనాలు ఇవ్వబోమని ప్రభుత్వం చట్టం తీసుకురావాలి. ఈ చట్టాన్ని కఠినంగా అమలుచేస్తే, పిల్లలు తప్పక పాఠశాలకు వస్తారు.

– పద్మనాభ బిసోల్, కుంద్రా మండలం

మా పాఠశాలలో అయిదు తరగతులకు ఒకే టీచర్ ఉన్నారు. దీని ఫలితంగా అన్ని తరగతులకు పాఠాలు చెప్పడం కష్టమవుతోంది. మాకు పుస్తకాలు కూడా అందలేదు కాబట్టి మా బడిలో పాత పాఠ్యపుస్తకాలనే వల్లెవేయిస్తున్నారు. మా పాఠశాల పరిస్థితి మెరుగు పడితే అంతకు మించిన సంతోషం ఏముంటుంది! – సునీతా శాంత లక్ష్మీపూర్ మండలం

## ఒడిషా కీర్తిపతాక


బాల తార

పద్మినీ రౌట్ ఒడిషాకు చెందిన చిన్నారి చెస్ క్రీడాకారిణి. ఈమె మహిళా గ్రాండ్‌మాస్టర్ టైటిల్ సాధించింది. ప్రపంచ అండర్ 14 బాలికల ఛాంపియన్‌షిప్ విజేతగాకూడా అయింది. ఇంతవరకు ఈ చిన్నారి అయిదు ఆసియన్ మరియు నాలుగు జాతీయ టైటిళ్లు సాధించింది. 2010లో జరిగిన ప్రపంచ జూనియర్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో పాల్గొన్న పద్మిని మూడోస్థానంలో నిలిచింది.

## విద్యాహక్కు గురించి మీకు తెలుసా!

1. ప్రతి పిల్లవాడు, పాప ఉచిత, నిర్బంధ విద్యా హక్కును కలిగి ఉన్నారు. ఈ చట్టం ఒరిస్సాలో ఎప్పుడు అమలులోకి వచ్చింది?
2. ఈ చట్టం ప్రకారం గ్రామ విద్యా కమిటీ స్థానంలో వచ్చే కమిటీ ఏది? ఈ కమిటీలో ఎంత మంది సభ్యులు ఉంటారు?
3. పాఠశాల అభివృద్ధి పథకం అమలు కాలం ఏది?
4. పిల్లల ఇండ్లకు ప్రాథమిక పాఠశాల ఎంత దూరంలో ఉండాలి?
5. పాఠశాలలో ప్రవేశానికి జన్మ ధ్రువీకరణ పత్రం లేని పిల్లలు సమర్పించగలిగిన ఇతర ధ్రువపత్రాలేమిటి?

సమాధానాలు

1. సెప్టెంబర్ 2010
2. గ్రామ విద్యా కమిటీ స్థానంలో పాఠశాల నిర్వహణ కమిటీ వస్తుంది. ఈ కమిటీలో 12-15 మంది సభ్యులు ఉంటారు.
3. పదవీకాలం మూడేళ్ల పాటు ఉంటుంది.
4. అయిదో తరగతి వరకు చదువుకునే పిల్లలకు సంబంధించి పాఠశాల, వాళ్ల ఇళ్లనుంచి 1 కిలోమీటర్ పరిధిలో ఉండాలి.
5. పిల్లలకు జన్మ ధ్రువీకరణ పత్రం లేకుంటే, అతడు/ఆమె ఆసుపత్రి రికార్డులను, అంగన్‌వాడీ రికార్డులను, తల్లిదండ్రులనుంచి తీసుకువచ్చిన అఫిడవిట్‌ని కూడా సమర్పించవచ్చు.




Liked what you read? Send your comments / queries to
Gopal Narayan Authey
Ph-07575-278336/278195
Email-dalitsangh@sify.com
dalitsangh@yahoo.co.in
Web-www.dalitsanghindia.org

Send us your feedback!
CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Content by : Child reporters, Koraput
Published by : Sarva Shiksha Abhiyan, koraput and Unicef Orissa
Editorial Assistance : People's group for Children's development (PGCD), Koraput



# అమ్మవారి నగలు

నాగవరంలో ఉన్న ఒక పురాతనమైన అమ్మవారి గుడికి, శివయ్య పూజారి. ఆ గ్రామానికి పొరుగున ఉన్న కేశవపురం జమీందారు, ఒకసారి జాతర వేడుకలలో, అమ్మవారికి ముక్కుపుడకా, కాసుల పేరూ, వడ్డాణం లాంటి బంగారునగలు చేయించి అలంకరించాడు.

ఈ బంగారు ఆభరణాలు ఎవరూ దోచుకుపోకుండా కాపాడవలసిన బాధ్యత, పూజారి శివయ్యకు అప్ప చెప్పబడింది.

శివయ్య భార్య రమణమ్మ పరమ గయ్యాళి. ఆమె కోరినవి వెంటనే తెచ్చి యివ్వకపోతే, ఇక ఆరోజుకు అతడికి భోజనం ఉండేది కాదు.

అమ్మవారికి కొత్తగా నగల అలంకరణ జరిగాక, రమణమ్మ దృష్టి వాటి వాటిమీద పడింది. వాటిని ధరించాలన్న కోరిక రోజు రోజుకూ ఎక్కువ కావడంతో, ఆమె భర్తను ఆ నగలు తెమ్మని బలవంత పెట్టింది.

భార్య కోరిక విని శివయ్య నిలువెల్లా కంపించిపోయి, ''ఏమే, నీకేమన్నా పోయే కాలం గాని దగ్గిరపడిందా! అమ్మవారి నగలను సామాన్య స్త్రీవైన నువ్వు ధరించడం మహాపాపం. ఆ ఆలోచన రావడమే తప్పు అంతగా కావాలంటే, అలాంటివే మరొకటి చేయిస్తాను. కాస్త ఓపికపట్టు,'' అన్నాడు

కాని రమణమ్మ అందుకు ఒప్పుకోక, ''నువ్వు ఈ రాత్రికి నగలు తీసుకురాకపోతే, రేపు సూర్యోదయం వేళకు మన పెరట్లో ఉన్న వేపచెట్టుకు ఉరేసుకు చస్తాను!'' అని భర్తను బెదిరించింది.

భార్య అన్నంతపనీ చేస్తుందని భయపడి, శివయ్య ఆ రాత్రి అమ్మవారి గుడికి

రాంబాబు

వెళ్ళి, అమ్మవారి విగ్రహం ముందు చేతులు జోడించి, ''అమ్మా, నా భార్య గయ్యాళితనం, నీకు తెలియందిది కాదు గదా! దాన్ని మెల్లిగా బుజ్జగించి త్వరలోనే, నీ నగలు నీకు అప్పజెప్పుతాను, క్షమించ దగని పని చేస్తున్నప్పటికీ, నన్ను క్షమిం చమని వేడుకుంటున్నాను!'' అంటూ విగ్రహానికున్న నగలన్నీ తీసి మూట కట్టాడు.



శివయ్య నగల మూట తీసుకుని గుడి నుంచి బయటకి రాబోతుండగా, అమ్మ వారికి సన్నిహితురాలైన మరొక దేవత ఆమెను చూడవచ్చి, శివయ్య చేసిన పని గమనించింది.

ఆమె అమ్మవారితో, ''నీ నగలు తీస్తుంటే, ఏమీ పట్టనట్లు చూస్తూ ఊరు కున్నావేం? నగలు లేకపోతే, నీ విగ్రహం కళ కోల్పోతుంది. వెంటనే పూజారికి బుద్ధి చెప్పు,'' అని హెచ్చరించింది.

దానికి అమ్మవారు చిన్నగా నవ్వి, ''ఈ శివయ్య నా భక్తుడు. నాకు ముందుగా క్షమాపణ చెప్పి, వాటిని తిరిగి పట్టుకు వస్తానని మాట ఇచ్చాడు. ఇతడి భార్యకు నాలుగు రోజుల వ్యవధి ఇస్తున్నాను. ఈ నాలుగు రోజుల్లో, నగలను తిరిగి ఆమె భర్తకు ఇవ్వకపోతే, తల పగిలి చస్తుంది!'' అన్నది. నగలమూటతో బయటకు వస్తున్న శివయ్యకు, అమ్మవారు అన్న ఆఖరి మాటలు మాత్రమే వినిపించాయి.

అతడు భయంతో వణుకుతూ, అమ్మ వారి విగ్రహం కేసి చూస్తూ స్థాణువులాగా నిలబడిపోయాడు. అయితే, ఆ తరవాత అతడికెలాంటి మాటలూ వినిపించ లేదు. దానితో, తాను భ్రమపడ్డానేమో అన్న సంశయం కలిగింది శివయ్యకు.

తరవాత అతడు గుడికి భద్రంగా తాళం వేసి, నగలమూటతో ఇంటికి వచ్చి, వాటిని భార్యకిచ్చాడు. రమణమ్మ మహా ఆనందపడిపోతూ, ఆత్రం పట్టలేక అమ్మవారి నగలను అప్పటికప్పుడే ధరిం చింది.

శివయ్య, భార్యకేసి కోపంగా చూస్తూ, తను అమ్మవారి గుడిలో విన్న మాటలు చెప్పాడు.

ఆమె భర్త కేసి మరింత కోపంగా చూస్తూ, ''నీలో పిరికిపాలు ఎక్కువ. అమ్మవారి నగలు తీసుకుపోతున్నానన్న భయం కొద్దీ, ఏవో మాటలు విన్నానని



భ్రమపడ్డావు. నేను మాత్రం, ఈ నగలు ఇచ్చేది లేదు!'' అన్నది.

ఇకపై నా భార్యను కాపాడే భారం నీదే నమ్మా!'' అని శివయ్య, అమ్మవారికి మనసులోనే మరొకసారి మొక్కుకున్నాడు.

మూడురోజులు గడిచాయి. రమణమ్మ మాత్రం తన ఒంటి మీదినుంచి అమ్మవారి నగలు తీయలేదు. శివయ్యకు అమ్మవారి మాటల మీద గురి ఏర్పడి, కంగారు పడిపోసాగాడు.

ఆ రాత్రి రమణమ్మ నగలు తీయకుండానే నిద్రపోయింది. సరిగా అర్ధ రాత్రి వేళ శివయ్య ఇంట ఒక దొంగ ప్రవేశించాడు.

వాడు బాగా నిద్రమత్తులో ఉన్న రమణమ్మ ఒంటి మీది నగలన్నీ బహు చాకచక్యంగా తస్కరించాడు. తరవాత, వాడు ఆ నగలమూటతో అమ్మవారి గుడి కేసి బయలుదేరి వెళ్లాడు.

దొంగ ప్రయత్నమేమంటే – పనిలో పనిగా అమ్మవారి నగలు కూడా దొంగిలించాలని. కాని, వాడు గుడి ముందుకు వెళ్లేసరికి, గుడి తాళం బద్దలు కొట్టబడి తలుపులు బార్లా తెరిచి ఉన్నవి.

అది చూసి వాడు చాలా ఆశ్చర్య పడ్డాడు. తనకన్న ముందే ఎవడో గుడిలో జొరబడ్డాడని గ్రహించి, కడుజాగ్రత్తగా చేతిలో ఉన్న దుడ్డుకర్రను బలంగా గుప్పిట బిగించి పట్టుకుని, గుడిలోకి వెళ్లాడు.

అయితే, అంతకు ముందే గుడి తాళం బద్దలు కొట్టి లోన ప్రవేశించిన మరొక దొంగ, అమ్మవారి విగ్రహానికి నగలు లేక బోసి పోవడం చూసి గతుక్కుమన్నాడు.

వాడికి ఆ నగలను అప్పుడే మరెవడో దోచుకుపోవడమో లేక రక్షణ కోసం పూజారి ఇంటికి తీసుకుపోవడమో జరిగి ఉంటుందన్న అనుమానం కలిగింది. చేసేదేమీ లేక వాడు నిరాశతో బయటకు వస్తున్నాడు.

సరిగ్గా ఆ సమయంలో వాడికి నగల మూటతో లోపలికి వస్తున్న దొంగ కంట బడ్డాడు. వెంటనే వాడు చేతిలో ఉన్న దుడ్డుకర్రను పైకెత్తి, ''ఒరే, నా కన్న ముందే వచ్చి నగలు దోచుకుని మూట కట్టావన్నమాట!'' అంటూ దొంగ తల మీద కొట్టాడు.

ఇలా జరుగుతుందని ముందే ఊహించిన రెండో దొంగ, అదే క్షణంలో గుడి తాళం బద్దలు కొట్టిన దొంగ తల మీద తన దుడ్డుకర్రతో ఫతేల్మని ఒక బాదు బాదాడు. దానితో ఇద్దరూ స్పృహ తప్పి కింద పడిపోయారు.

తెల్లవారు జామున నిద్రలోంచి మెలకువ వచ్చిన రమణమ్మ, ఒంటిమీద నగలు లేకపోవడం తెలుసుకుని, ప్రాణం పోయేలా ఒక్క కేక పెట్టి భర్తను నిద్ర లేపింది.

శివయ్య బెంబేలు పడిపోతూ, ఉన్న ఫళాన అమ్మవారి గుడికి పరిగెత్తాడు. అక్కడ పక్కన నగల మూటతో ఇద్దరు వ్యక్తులు స్పృహలేకుండా పడి ఉండటం చూసి సంగతి గ్రహించాడు.

శివయ్య మూట విప్పి నగలు తీసి వాటిని అమ్మవారికి అలంకరిస్తూండగా, అక్కడికి రమణమ్మ వచ్చింది.

భార్యను చూసి శివయ్య, ''ఏమే, ఇప్పటికైనా అర్థమయిందా? నాలుగు రోజుల్లో నగలు తిరిగి ఇవ్వకపోతే, నువ్వు తల పగిలి చస్తావని అమ్మవారన్నది. ఆ మాటలు నేను విన్నాను. కాని, నువ్వు అదంతా, నా భ్రమ అని కొట్టి పారేశావు!'' అన్నాడు.

రమణమ్మ ఒక్కసారిగా అమ్మవారి విగ్రహం ముందు సాష్టాంగపడుతూ, ''అమ్మా, నేను మూర్ఖురాలిని! నీ భక్తుడైన, నా భర్త కారణంగా, నా ఘోర అపరాధం క్షమించి నా ప్రాణాలు నిలబెట్టావు. ఈ క్షణం నుంచి, నేనూ నీ భక్తురాలనే,'' అన్నది.

తరవాత, ఊరు కాపలా వాళ్లు వచ్చి, అప్పుడే స్పృహ వస్తున్న దొంగలిద్దర్నీ న్యాయాధికారి దగ్గిరకు లాక్కుపోయారు. న్యాయాధికారి వారిద్దరికీ కఠిన దండన విధించాడు.

ఇది జరిగాక రమణమ్మ తన గయ్యాళితనం మాని, భర్త చెప్పినట్టు వింటూ అతడితో పాటు అమ్మవారికి సేవలు చెయ్యసాగింది.






# తగిన వైద్యం

అంగదేశపు రాజుకు ఊబకాయం పెను సమస్యగా మారింది. ఆయనచేత కషాయాలూ, మాత్రలూ మింగిస్తున్నారు. కానీ వ్యాధి తగ్గడం లేదు. ఔషధాలు సేవించి, సేవించి రాజుకు క్రమంగా రుచిని గ్రహించే శక్తి కూడా తగ్గిపోయింది. అందువలన తనకు వైద్య సహాయం అందించేవారు కషాయాలూ, మాత్రలూ తన చేత మింగించరాదనీ రాజు ఒక నియమం పెట్టాడు.

వైద్యులు తెల్లబోయారు. రాజు ఊబకాయం తగ్గించటం తమవలన సాధ్యంకాదని ప్రకటించారు. రాజు వ్యాధి సంగతి తెలిసి అంగరాజ్యం మీద దండెత్తి రాజ్యాన్ని వశపర్చుకునేందుకు ఆయన శత్రురాజులు తమ ప్రయత్నాలు ప్రారంభించారు. రాజు ప్రకటన తెలుసుకున్న తర్వాత కూడా అంగరాజ్యపు సరిహద్దు కొండ ప్రాంతాల నుంచి ఒక వైద్యుడు ఆయన జబ్బును బాగుచేస్తానని కబురు పంపించాడు.

రాజుకు అరికాలిమంట నెత్తికెక్కింది. ఒక రాజుకు కబురు పంపేటంత ధైర్యం ఆ వైద్యుడికెలా వచ్చిందో తెలుసుకోవాలని తన పరివారాన్ని అతడివద్దకు పంపించాడు. అతడ్ని వెంటపెట్టుకుని రావలసిందిగా కూడా ఆదేశించాడు రాజు.

పరివారం ఆ వైద్యుడిని ఎట్టకేలకు పట్టుకుంది. పండుముసలి వయస్సులో ఉన్నాడు ఆ వైద్యుడు. రాజుపట్ల అమర్యాదతో ప్రవర్తించినందుకు సంజాయిషీ అడిగాడు పరివారంలోని ముఖ్యుడు.

''రాజుకి నేను మర్యాద ఇవ్వడం కావాలా..? తగిన వైద్య చికిత్స అందించటం కావాలా..?'' అడిగాడు వైద్యుడు. అతడు అడిగిన తీరుకు పరివారం ముఖ్యుడు గాభరాపడ్డాడు. ''రాజు మా కొండప్రాంతాలకు వస్తేనే వైద్య చికిత్స ప్రారంభిస్తానని తెలియపరచండి'' అన్నాడు వైద్యుడు.

పరివారం అతనిని పొగరుబోతుగా జమకట్టింది. ''రాజుగారే ఇక్కడికి రావాలా..?

ఎమ్. వి. వి. సత్యనారాయణ

నీకు తగిన శిక్ష పడుతుంది సుమా..! పొగరు చూపుతున్నావు..!'' అన్నాడు ముఖ్యుడు.

వైద్యుడు చిరునవ్వు నవ్వాడు.

''నిన్ను ఇప్పుడు మా వెంట రాజధాని నగరానికి తీసుకుపోతే ఏం చెయ్యగలవు..? రాజుగారికి వైద్యం చేసే అదృష్టం నీకు కలుగుతుంది. అలా కాకపోతే నీకు మరణశిక్ష విధిస్తారు సుమా..?!'' అన్నాడు ముఖ్యుడు.

వైద్యుడు అదే చిరునవ్వును కొనసాగిస్తూ.. ''ఇంత వయస్సు వచ్చాక చస్తేనేం, బ్రతికితేనేం. వితండవాదంమాని రాజుని ఇక్కడికి పంపించండి'' అన్నాడు.

ఇక చేసేదిలేక పరివారం తిరిగి వెళ్ళిపోయి, రాజుకు జరిగిన విషయమంతా వివరించింది. రాజు చిరునవ్వు నవ్వి.. ''ప్రయాణానికి ఏర్పాట్లు చేయండి!'' అన్నాడు. పరివారానికి మరోసారి మతిపోయింది. కొండ ప్రాంతాల్లో ఆయనకి రక్షణ ఏర్పాట్లు కష్టమని రాజును హెచ్చరించింది. అయినప్పటికీ రాజు ప్రయాణం ఆగలేదు. వైద్యుడు ఆయన్ని సాదరంగా ఆహ్వానించి, కొండ ప్రాంతాల ఔషధ మూలికల సేకరణకు తనవెంట తీసుకుపోయేవాడు.

రాజుకు వైద్యుడే స్వయంగా వండి తానే వడ్డించేవాడు. రాజుకు రుచి తెలియడం మొదలుపెట్టింది. మూలికలను శుద్ధి చెయ్యడం, ఔషధాలు తయారు చెయ్యడంలో రాజు స్వయంగా పాల్గొంటూ వచ్చేవాడు. ఆయనే వండేవాడు.

ఒక నెల తరువాత రాజును చూసేందుకు రాణి వచ్చింది. ఆమె తన కళ్లను తానే నమ్మలేకపోయింది. రాజు నాలుగోవంతుకు తగ్గిపోయాడు. అంతేగాకుండా ఆయన కళ్ళలో, శరీరంలో కొత్త జీవకళ కనిపిస్తోంది.

''ఇది ఎలా సాధ్యం?'' అని అడిగింది రాణి.

వైద్యుడు సమాధానం చెప్పేలోపుగా రాజు కలుగజేసుకుంటూ.. ''ఇక్కడ నాపని నేను చేసుకుంటున్నాను. వనమూలికలతో నిత్యం గడుపుతున్నాను. ప్రతిరోజూ చాలా దూరం నడుస్తున్నాను. ఇదంతా అంతఃపురంలో సాధ్యం కాదని వైద్యుడు నన్ను తనవద్దకే రప్పించుకున్నాడు'' అన్నాడు.

పరివారం తమ తప్పు తెలుసుకుంది. రాజును పరిపూర్ణమైన ఆరోగ్యవంతుడిగా తిరిగి అప్పజెప్పాడు వైద్యుడు. అంతకంటే తమకు ఏం కావాలి..?





# నిజరూపం

చతురంగపురాన్నేలే రాజు చంద్రహాసు డికి, రాజగురువు రుద్రాక్షుడి పట్ల ఎంతో భక్తి గౌరవాలుండేవి. అందుకు కారణం, చంద్రహాసుడు దాయాదులవల్ల ఇబ్బందులకు గురయినప్పుడు, రుద్రాక్షుడు ఆయనకు తగు సలహాలిచ్చి, సింహాసనం కాపాడుకునేందుకు ఎంతగానో సాయపడ్డాడు. ఆ కృతజ్ఞతతో రాజు, రాజగురువు మాట శిరసావహించే వాడు.

అయితే సర్వసంగపరిత్యాగినని చెప్పుకునే రుద్రాక్షుడిలో విపరీతమైన అహంకారం ఉండేది. ఆయన ఎల్లప్పుడూ కాషాయవర్ణంలో ఉన్న పట్టు చీనాంబరాలు ధరించేవాడు. మెడలో రత్నాలహారం, చేతులకు బంగారు కంకణాలతో చాలా ఆడంబరంగా కనబడేవాడు. రాజగురువు స్థానంలో రాజు దగ్గర తనకున్న పలుకుబడి కారణంగా, మంత్రులనూ, ఇతర ఆస్థానోద్యోగులనూ చిన్నచూపు చూస్తూ అవమానపరిచేవాడు. రాజుకు చూచాయగా ఈ విషయం తెలుస్తున్నప్పటికీ ఈ విషయాన్ని తమ ఇరువురి మధ్యా చర్చకు తీసుకువచ్చేవాడు కాదు.

రుద్రాక్షుడు ఒకనాడు చంద్రహాసుడితో ''రాజా, నీకు నాపట్ల ఉన్న భక్తి గౌరవాల సంగతి అందరూ ఎరిగినదే! కాని, రాబోవు తరంవాళ్లు కూడా, ఆ సంగతి గుర్తుంచుకునేందుగ్గాను, నా శిలావిగ్రహాన్ని నగరంలోని, నాలుగు వీధులూ కలిసే చోట ప్రతిష్ఠించు,'' అన్నాడు.

చంద్రహాసుడు అందుకు సరేనని, మంత్రి మార్తాండుడిని పిలిపించి రాజగురువు కోరిక గురించి చెప్పి, ''మీరు

జొన్నలగడ్డ రత్న

ముందుగా దేశదేశాల్లో ప్రసిద్ధులైన శిల్పుల గురించి విచారించండి. వారిలో అత్యంత సమర్థుడైన శిల్పికే ఈ పని అప్పచెప్పండి. అన్నింటికన్న ముఖ్యం - ఆ విగ్రహ ప్రతిష్ట, ఆయన రాబోయే జన్మదినోత్సవం నాడు జరిగే విధంగా చూడండి,'' అన్నాడు.

మార్తాండుడు, ఆస్థాన చిత్రకారుడి చేత రుద్రాక్షుడి చిత్తరువు తయారు చేయించాడు. తరవాత ఆ చిత్తరువును, అవంతీనగరంలో ఉన్న మల్హణాచారి అనే సుప్రసిద్ధ శిల్పికి పంపుతూ ఒక లేఖ జతపరిచాడు.

ఆ లేఖలో ఆయన, ''ఈ చిత్తరువు చతురంగపురాన్నేలే చంద్రహాస మహా రాజుగారి గురువులైన రుద్రాక్షులవారిది. సాధ్యమైనంత త్వరగా విగ్రహాన్ని తయారు చేసి తీసుకురండి. శిల్పాన్ని తయారు చేసేటప్పుడు, ఒక ముఖ్య విషయం మాత్రం గుర్తుంచుకోండి: రాజగురువు సర్వసంగ పరిత్యాగి!'' అని తెలియపరి చాడు.

రుద్రాక్షుడి జన్మదినోత్సవానికి కొంచెం ముందుగా, మల్హణాచారి రాజగురువు విగ్రహాన్ని తయారుచేసి, చతురంగ పురానికి తీసుకుపోయాడు.

మంత్రి ఆ సంగతి రాజుకు తెలియ పరచగానే, ఆయన ఎంతగానో సంతో షించి, తాను స్వయంగా జన్మదినోత్సవం నాడు, విగ్రహప్రతిష్ట చేయదలిచినట్లు చెప్పాడు.



అనుకున్న రోజు మంగళవాయిద్యాల మధ్య రాజు విగ్రహానికి ఆచ్ఛాదనగా ఉన్న పట్టు వస్త్రాన్ని తొలగించగానే, రుద్రా క్షుడు దానికేసి తేరి పారచూసి, పట్టరాని ఆగ్రహావేశంతో, ''రాజా, ఇది నా శిలా విగ్రహమా? కంచుకాగడా వేసినా ఇందులో ఎక్కడా నా పోలికలు కనిపిం చవు.!'' అన్నాడు.

రాజు, ఆ మాటలకు ముఖం చిన్న బుచ్చుకుని మార్తాండుడికేసి చూశాడు. మంత్రి మార్తాండుడు వినయంగా ''ప్రభూ, ఈ విగ్రహాన్ని తయారు చేసింది, ప్రఖ్యాత శిల్పి అయిన మల్హ ణాచారి. అపురూపమైన కళాఖండాల నెన్నిటినో చెక్కి, తనకు మరెవరూ సాటి రారన్న ఖ్యాతి రావడంతో, అతడిలో బాగా అహంకారం తల ఎత్తినట్లుంది. విగ్ర

హంలో ఉన్న లోపాలు అతడికి తెలియ పర్చడం తప్పనిసరి అవసరం.'' అని వెంటనే మల్హణాచారిని పిలిపించాడు.

మల్హణాచారి, రాజు ముందుకు వచ్చాడు. రాజు అతడితో, ''నువ్వు ప్రసిద్ధి కెక్కిన శిల్పివే కావచ్చు. కాని, మా గురువు గారి విగ్రహాన్ని తయారు చెయ్యడంలో పూర్తిగా విఫలం చెందావు. వారు విగ్ర హాన్ని పరీక్షించి, తన స్వరూపానికీ, ఈ విగ్రహానికీ అసలు పోలికలే లేవంటు న్నారు.'' అన్నాడు.

మల్హణాచారి ఆశ్చర్యపడుతున్న వాడిలా, ఒకసారి మంత్రి మార్తాండుడి కేసి చూసి రాజుతో, ''మహారాజా, రాజ గురువు గారి విగ్రహాన్ని, నేను మంత్రి గారు పంపిన చిత్తరువు చూసిన తర్వాతే మలచడం ప్రారంభించాను. అయితే, మంత్రిగారు నాకు పంపిన లేఖలో, రాజగురువు సర్వసంగపరిత్యాగి అనీ, విగ్రహాన్ని తయారు చేసేటప్పుడు, ముఖ్యంగా ఆ విషయం గుర్తుంచుకోవ లసి ఉంటుందనీ, ఆదేశించారు.'' అన్నాడు.

''అవును, ఆ మాట నిజమే!'' అన్నాడు మార్తాండుడు.

ఈసారి మల్హణాచారి, రాజగురువు కేసి పరీక్షగా చూసి, ''ప్రభూ! సర్వసంగ పరిత్యాగులైన మహాపురుషుల రూపు రేఖలెలా ఉంటాయో నాకు తెలియంది కాదు. అందుకే చిత్తరువులో లేనప్పటికీ విగ్రహం వదనంలో ప్రశాంతత, వస్త్ర ధారణలో నిరాండబరత, మెడలో రుద్రాక్ష మాలలూ, చేతిలో దండకమండలాల వంటి మార్పులు అవసరం అని భావించి



– అలా తయారు చేశాను. ఇందుకు మన్నించకోరతాను. అతి త్వరలో, మంత్రి గారు పంపిన చిత్తరువులో ఉన్న విధంగా, మరొక విగ్రహాన్ని తయారు చేసి సమర్పించగలను,'' అన్నాడు.

''అలాగే చెయ్యి. కాని, పని మాత్రం చాలా త్వరగా పూర్తవ్వాలి.'' అన్నాడు రాజు.

మల్హణాచారి, రాజుకు నమస్కరించి వెళ్లబోతూండగా రుద్రాక్షుడు అతడిని ఆపి రాజుతో, ''ఆ విగ్రహంలో ఎటువంటి మార్పూ అవసరం లేదు. అంతేకాదు. దాన్ని ఇంత అర్భాటంగా నగరమధ్యంలో ప్రతిష్టించవలసిన అవసరం కూడా లేదు.'' అన్నాడు.

ఆ మాటలకు అందరూ ఆశ్చర్యపోతూ చూసేంతలో రుద్రాక్షుడు, ''చంద్రహాసా! అలౌకిక విషయాల్లో నేను ఎంతో కొంత జ్ఞానసముపార్జన చేశాను. అలాంటి నేను లౌకిక విషయాలలో అవసరానికి మించిన జోక్యం కల్పించుకుంటూ, చాలామందికి బాధ కలిగించాను. అందువల్ల, నా నిజ రూపం మరుగున పడిపోయింది. ఆ సంగతి మీలో చాలామంది గుర్తించే ఉంటారు. అవునా!'' అన్నాడు.

ఆ ప్రశ్నకు ఎవరూ వెంటనే జవాబివ్వలేదు. కొంతసేపటికి రుద్రాక్షుడు మందహాసం చేసి, ''మంత్రి మార్తాండుడు, శిల్పి మల్హణాచారి ద్వారా, మరుగయిపోయిన నా నిజరూపాన్ని వెలికి తీసి, నాకు ఎంతో మహోపకారం చేశాడు. ఆయన వంటి సమర్థులైన మంత్రులూ, ఇతర రాజోద్యోగులూ నీకు సహాయంగా ఉండగా, నా అవసరం ఇక ఈ రాజ్యానికి లేదు. వెలుగులోకి వచ్చిన, నా నిజరూపం మళ్లీ మకిలి పట్టి పాడైపోకుండా ఉండాలంటే – భగవదారాధనకు మించి నేను చేయగలిగింది మరొకటి లేదు. నన్ను తీర్థయాత్రలకు పంపే ఏర్పాట్లు ఇప్పుడే చేయించు,'' అన్నాడు.

ఆ మర్నాడే రుద్రాక్షుడు రాజప్రసాదం విడిచి తీర్థయాత్రలు చేసేందుకు బయలు దేరి వెళ్లిపోయాడు.






# మొసలి

పెద్దవాళ్ళు చాలా తప్పులు చేస్తారని అందరికీ తెలుసు. వాటిలో అతి పెద్ద తప్పు ఏదంటే నిజాన్ని నమ్మేందుకు తిరస్కరించడమే. ఉదారణకు ఈ చిన్న విషయమే తీసుకోండి. పాఠశాలనుంచి ఇంటికి తిరిగి రాగానే నా బ్యాగును బల్లమీదకి విసిరి వెంటనే మైదానంలోకి వెళ్లాను. ఏ రకంగా చూసినా ఇది నేరం కాదు. కాదు కదూ? అయితే బుద్ధిలేని నా స్కూల్ బ్యాగ్ బల్లమీది ఫ్లవర్‌వాజ్‌ని తోసి వేసింది. దానిలోంచి తొణికిన నీళ్లు బల్లమీది ముఖ్యమైన పత్రాలను పాడు చేశాయట. అందుకని ఇంట్లోవాళ్లు నన్ను తప్పు పడుతున్నారు! ఫ్లవర్‌వాజ్‌ని ఉద్దేశపూర్వకంగా నేను పడవేయలేదని, అనుకోకుండా అది కింద పడిపోయిందని నచ్చచెప్పడానికి నేను ఎంతగా ప్రయత్నించినా లాభం లేకపోయింది. కనీసం నా మాటలు వినడానికి కూడా ఎవరికీ ఆసక్తి లేకుండా పోయింది. అవి అంత ముఖ్యమైన పత్రాలయినట్లయితే నిర్లక్ష్యంగా వాటిని అలా బల్లమీద ఎందుకుంచారు?

ఏదేమైనా, ఇదంతా చూసింతర్వాత కోకోలై గురించి వారికి తెలుపకూడదనే నిశ్చయించుకున్నాను. ఓహ్! కోకోలై ఎవరో మీకు కూడా తెలీదు కదూ! సరే, చెబుతాను వినండి. మా ఇంటి వెనుక నీటిని పంపడానికి ఒక మురికినీటి గొట్టం అమర్చారు. ఆ గొట్టం నుంచి మురికి మడ్డి కిందికి వెళ్లే ప్రాంతంలో పిల్లలు కొన్ని విత్తనాలను చల్లారు. ఆ మురికి మడ్డి స్థానంలో సుందరమైన పూల మొక్కలు కనిపించాలని వారి ఉద్దేశం. ఆ విత్తనాలు కొన్నాళ్లయ్యాకసుందర్బాన్ ప్రాంతంలోని మడ చెట్ల వనాన్ని తలపిస్తూ ఏపుగా పెరిగాయి. ఈ ఉదయం ఆ వైపు నేను పరికిస్తుండగా అక్కడ ఎవరో పడుకుని ఉండటం గమనించాను. దాన్ని చూడగానే నేను భీతి చెంద

ప్రకల్ప భట్టాచార్య

లేదంటే అబద్ధమవుతుంది. అయితే నా చేతిలో కర్ర ఉంది కాబట్టి దాని సాయంతో పొదలను తొలగించుకుంటూ వెళ్లి చూశాను. అక్కడ పెద్ద మొసలి ఒకటి నా కంటపడింది!

నేషనల్ జాగ్రఫీ ఛానెల్‌లో మొసళ్ల చిత్రాలను చాలానే చూశాను. అలాగే జూలో కూడా చాలా మొసళ్లను చూసి ఉన్నాను. సూర్యుడి కెదురుగా నోరు పెద్దగా తెరిచి ఉంచి ఉన్న మొసళ్లను నేను చూసాను. ఆ అనుభవంతో నేను చేతిలో కర్రను గట్టిగా పట్టుకుని దాని సమీపంలోకి వెళ్లి దాన్ని 'ఎవరు నీవ'ని అడిగాను. అయితే అది చాలా పెద్ద వయసు మొసలిలా కనబడు తోంది. పైగా దాని పళ్లు కూడా ఊడిపోయి నట్లుంది. చూస్తుంటే చాలా రోజులుగా తిండి లేకుండా ఉన్నట్లుంది. నా ప్రశ్నకు అది సమాధానంగా 'నేను మొసలిని' అని జవాబి చ్చింది. అయితే పళ్లులేని ఆ నోట్లోంచి ఆ శబ్దం మరొకలా అనిపించింది. నాకు పెద్దగా నవ్వు వచ్చింది. పళ్లు లేని మొసలి అనాలని పించింది.

అయితే నన్ను నేను అదుపులో పెట్టు కుని, ''మా ఇంటి వెనుక చేరి నీవు ఇక్కడ ఏంచేస్తున్నావు?'' అని అడిగాను. నత్తులు పలుకుతూ అది చెప్పిన సమాధానం బట్టి, సమీపంలో ప్రవహిస్తున్న నదీ మార్గం గుండా ఈ ప్రాంతానికి వచ్చిందట. నిన్నటి దినం నీటి ప్రవాహం కాస్త మందగించగానే అది ఇక్కడ ఇరుక్కుపోయిందట. నిజంగానే గత రెండు రోజులుగా ఈ ప్రాంతంలో భారీ వర్షాలు కురుస్తున్నాయి. మాకు సమీప ప్రాంతంలోని నదిలో కొన్ని మొసళ్లు నివసిస్తూ ఉన్న ట్లుంది.



మొసలి కావచ్చు లేక మరొక ప్రాణి కావచ్చు, అది మా ఇంటి తలుపులు తట్టి నప్పుడు వెళ్లిపొమ్మని చెప్పలేను కదా. పైగా అది మరీ దయనీయ స్థితిలో ఉంది. 'బిస్కట్లు తింటావా' అని దాన్ని అడిగాను. బహుశా దానికి బిస్కెట్లు అంటే ఏమిటో తెలీదు కాబోలు, సద్దు లేకుండా ఉండిపోయింది. తిరిగి ఇంటికి వెళ్లి బిస్కట్ల్ డబ్బా తీసుకొచ్చి కొన్ని బిస్కట్లను దాని ముందు ఉంచాను. అది కొన్ని బిస్కెట్లను చప్పరించి తూగటం మొదలెట్టింది. మధ్యాహ్నం అది నిద్రపోయే సమయం కాబోలు.

మా ఇంట్లో వాళ్ళకి మొసలి విషయం చెప్పెయ్యాలనుకున్నాను. అలాగయితే వారు దాన్ని క్షేమంగా నదిలో విడిచి పెడతారు. కాని ఇందులో చిక్కు ఉంది. వాళ్లు నేను చెప్పే మాటలు నమ్ముతారా? ఈ రోజు ఉదయం కూడా బిస్కట్ల డబ్బా ఒక్క రాత్రి

లోనే సగం ఎలా ఖాళీ అయిపోయిందని పరిశోధన మొదలెట్టారు. నేను దాంట్లోంచి చిన్న ముక్క కూడా తినలేదని మొత్తుకున్నాను. కానీ ఎవరూ నా మాటపట్టించుకోలేదు. అందుకని కోకోలై -మొసలి-సంరక్షణ బాధ్యతను నేనే చేపట్టాలనుకున్నాను. కాస్సేపటి తర్వాత నేను దానికి మొక్కజొన్న పొత్తులు ఇచ్చాను. పళ్లు లేవు కదా, లేకుంటే అది గట్టి వస్తువులను కరకరా నమిలేసేది. దానికి మల్లే జొన్న పొత్తులు నాకే మాత్రం ఇష్టం ఉండవు కాని, వాటిని తప్పక తినవలసిందే.

ఏదేమైనా, ఇప్పుడిది పెద్ద చిక్కే అవుతుంది. మొక్కజొన్న పొత్తులు సగం వరకు ఎలా ఖాళీ అయిపోయాయని పెద్దవాళ్లు చర్చించడానికి ముందే ఇటీవలే దాడిచేసిన డెంగ్యూ వ్యాధిపై ముందుజాగ్రత్తగా ఇంటి చుట్టుపక్కల దోమల వ్యాప్తిని అరికట్టాలనుకున్నారు. దానికి ఇంటి చుట్టూ ఉన్న పూల మొక్కలు, పొదలు వంటి వాటిని పూర్తిగా తొలగించాలని వారు నిర్ణయించారు. ఇంట్లో నా పాటికి నేను పాలు తాగుతున్నట్లు నటిస్తూనే వారి సంభాషణ అంతా వింటూ వచ్చాను. వారు రేపు ఉదయం కోకోలైని కనిపెడితే ఏమవుతుంది? పాముల భయం ఉంది కాబట్టి తమతో పాటు వారు రేపు ఈటెలు వంటి సామగ్రి కూడాతెచ్చుకోవడానికి ఏర్పాట్లు చేసుకోవాలనుకుంటున్నారు. ఈ చిక్కు నుంచి మొసలిని తప్పించాలి.

పరుపు మీద అటూ ఇటూ దొర్లుతూ, ఉన్నట్లుండి బయట వాన పడుతుండటం గమనించాను. అమ్మయ్య! వాన పడాలి. కాలువలలో నీళ్లు పెరిగే కొద్దీ మొసలి మళ్లీ నదిలోకి ఈదుకుంటూ పోగలదు. ఈలోగా నేను ఇంటిలో ఉన్న అన్ని కుళాయిలను తెరిచి ఉంచాను బయట భారీ వాన కురుస్తున్నందున ఇంట్లో కుళాయిల నుంచి నీరు ధారగా కారుతున్న శబ్దం బయటకు వినిపించదు. మురికి కాలువలోని నీరు వేగంగా పెరగసాగింది.

ఇంట్లో నీటి ట్యాంక్ ఖాళీ అయిపోయిన వైనం తెలుసుకుని రేపు ఉదయం పెద్దవాళ్లు మరొక సమావేశానికి పిలుపునిస్తారు. నేను మాత్రం సమీపంలో ఉన్న నదికేసి ప్రశాంతంగా చూస్తుంటాను.



# కెరీర్ అంటే?



కంప్యూటర్ గేమింగ్ అంటే నేను పడిచస్తానని మీకందరికీ తెలుసు. యానిమేషన్ మరియు గేమింగ్ రంగంలో కెరీర్ ఎంచుకోవాలంటే చాలా సృజనాత్మకత, కల్పనా శక్తి కావలసి ఉంటుందని మా కెరీర్ కౌన్సిలర్ చెప్పాడు. అధునాతన కంప్యూటర్ యానిమేషన్ లేదా గేమింగ్ టెక్నాలజీలపై పట్టు కలిగి ఉండాలట. ఈ పరిశ్రమలో ఉన్న విభిన్న రంగాల గురించి మీకు తెలియజేస్తాను.

- ఆర్టిస్ట్: యానిమేటర్లు, మోడెల్లర్లు, కేరక్టర్ డిజైనర్లు, టెక్చర్ డిజైనర్లు ఈ విభాగంలోకి వస్తారు.
- ప్రోగ్రామర్లు: వీళ్ళు ఇంజనీర్లు. చాలా కంపెనీలు వీరిని ప్రోగ్రామర్లుగా పిలుస్తుంటాయి. గేమ్‌లకు సహకరించడానికి అవసరమైన ఆటలు, ఉపకరణాలు రూపొందించడం వీరి పని.
- ఆన్‌లైన్ అడ్మినిస్ట్రేటర్: మైక్రోసాఫ్ట్ మరియు సోనీ వంటి పెద్ద కంపెనీలు, తమ ఆన్‌లైన్ సిబ్బందిని ఉపయోగించి వారి ఎమ్‌ఎమ్‌ఓలను నడుపుతుంటారు. వీరు వెబ్‌సైట్లను నిర్వహిస్తూంటారు, గేమ్ సర్వర్లను పర్యవేక్షిస్తూ వాటి పనితీరును గమనిస్తుంటారు.
- నిర్మాత: దీనికి చాలా కీలక పాత్ర ఉంది. తుది ఉత్పత్తి తయారీకి ఇదే కీలకమైనది.
- నాణ్యత హామీ: ఈ కేటగిరీ రెండు విభాగాలను కలిగి ఉంది. టెస్టింగ్ అనేది గేమ్ ప్లే కోసం గేమ్‌లను సమీక్షిస్తుంది; నాణ్యతపై హామీ అనేది ఈ గేమ్‌లలో బగ్‌లు మరియు లోపాలను పరిశీలిస్తుంది.
- కస్టమర్ సపోర్ట్: ఈ సౌకర్యం చాలా కంపెనీలలో అందుబాటులో లేనప్పటికీ నింటెండో మరియు సెగా వంటి పెద్ద పెద్ద ప్రచురణ సంస్థలు వివిధ సాంకేతిక సమస్యలకు సంబంధించి వినియోగదారులకు సహాయపడే వ్యక్తులను నియమించుకుంటున్నాయి.
- గేమ్ టెస్టర్: గేమ్ టెస్టర్ పాత్ర సజీవమైనది! కాని అతడు/ఆమె గేమ్ వెనుక సాంకేతిక జ్ఞానం తెలుసుకుని ఉండాలి. అందుకని ఈ ఉద్యోగానికి సైన్స్ నేపథ్యం తప్పనిసరి.
- కార్యనిర్వాహక ఉద్యోగాలు: ఒక గేమ్‌ని విజయవంతంగా రూపొందించడానికి కంపెనీ ప్రజాసంబంధాల విభాగం, అక్కౌంట్లు, ఇతర కార్యనిర్వాహక ఉద్యోగాలను కల్పిస్తుంటుందనే విషయాన్ని మనం మర్చిపోతుంటాము. ఈ తరహా ఉద్యోగాలకు గేమ్‌ల గురించి కనీస పరిజ్ఞానం అవసరం కావచ్చు.



– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 23

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 23 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. డిసెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. ఫిబ్రవరి 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ఒలింపిక్స్ విశేషాలు




1. మొట్టమొదటి ఒలింపిక్స్ ఎప్పుడు నిర్వహించబడింది?
2. మొట్టమొదటి శీతాకాలం ఒలింపిక్ క్రీడలు ఎప్పుడు నిర్వహించబడ్డాయి?
3. ఆధునిక కాలంలో వేసవి, శీతాకాల ఒలింపిక్స్‌లలో ఎన్ని క్రీడలు ఉంటున్నాయి?
4. 2008 వేసవి ఒలింపిక్స్ క్రీడలు ఎక్కడ నిర్వహించబడ్డాయి?
5. ఒలింపిక్ క్రీడలను మూడుసార్లు రద్దు చేశారు. ఎందుకు?
6. తదుపరి ఒలింపిక్ క్రీడలు ఎప్పుడు ఎక్కడ నిర్వహిస్తారు?

## చందమామ లోకజ్ఞానం క్విజ్-21 అక్టోబర్ 2010 సమాధానాలు

1. కన్హా 2. రైనోసార్స్ 3. ప్రాజెక్ట్ టైగర్
4. 90 జాతీయ పార్కులు, 482 వన్యప్రాణి సంరక్షణ కేంద్రాలు
5. గిండీ నేషనల్ పార్క్, చెన్నయ్, భారత్ 6. డాల్ఫిన్

అక్టోబర్ నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.



# నవ్వుల పువ్వులు



టీచర్ : రాహుల్, అక్బర్ చక్రవర్తి ఎప్పుడు పుట్టాడు, ఎప్పుడు చనిపోయాడు?
రాహుల్: మేడమ్, నాకు తెలియదండీ.
టీచర్ : అది నీ ముందర ఉన్న పుస్తకంలో ఉంది కదా చూడు.
రాహుల్: 1542–1605
టీచర్: అవును
రాహుల్: అయ్యో ఇది అక్బర్ ఫోన్ నంబర్ అనుకున్నానండీ.



పోలీస్ : నువ్వు గడియారం ఎందుకు దొంగిలించావు?
దొంగ : సర్, నేను దాన్ని దొంగిలించలేదు. దాని యజమాని నాకు దాన్ని ఇచ్చాడు.
పోలీస్ : నిజంగా! యజమాని దాన్ని నీకు ఎప్పుడిచ్చాడు?
దొంగ : నేను అతడికి కత్తి చూపించినప్పుడు.



గంగ : నా హ్యాండ్ బ్యాగ్‌లో నీ చేయి ఎందుకు పెట్టావు?
రాము : నీ పెన్ తీసుకోవాలనిపించింది
గంగ : నన్నడగవచ్చు గదా
రాము : కొత్తవాళ్లతో నేను మాట్లాడను.



రమేష్ : కప్ప మ్యావ్ అని ఎందుకు అంటోంది?
రమ్య : అది విదేశీ భాషను నేర్చుకుంటోంది.



టీచర్ : అనన్యా, నీవు బనానా అనే పదాన్ని పలుకుతావా?
అనన్య : పలకగలను మేడం, కాని ఎప్పుడు ఆపాలో కాస్త చెప్పండి.

# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు ఫిబ్రవరి 2011 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కరికి రూ.500 బహుమతి ఉంటుంది.

పజిల్ – 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 7 | 2 | | 5 | | | | 8 | |
| | | | | | | 6 | | |
| | | | | | 2 | | 1 | |
| | 3 | 5 | 1 | | | 7 | | 4 |
| | | 4 | | | | 8 | | |
| 2 | | 7 | | | 4 | 1 | 3 | |
| | 9 | | 2 | | | | | |
| | | 8 | | | | | | |
| | 5 | | | | 1 | | 4 | 3 |

పజిల్ – 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | |
| 1 | 3 | | | | | | 4 | |
| | | | | 3 | 9 | | 7 | |
| | 5 | | | | | 8 | | 2 |
| | 4 | | 7 | | 2 | | | |
| 8 | 6 | | | | | 4 | | |
| 2 | | | | 1 | 7 | | | |
| | 8 | | 5 | | | | 3 | 1 |
| 4 | | | | 9 | | | | |

మీ ఎంట్రీలను 2010 డిసెంబర్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

e-mail your entries to:contests@chandamama.com

అక్టోబర్' 10 సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ – 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 7 | 3 | 1 | 2 | 9 | 6 | 8 | 4 |
| 4 | 9 | 8 | 6 | 7 | 3 | 5 | 1 | 2 |
| 6 | 1 | 2 | 8 | 4 | 5 | 7 | 9 | 3 |
| 2 | 5 | 7 | 9 | 1 | 6 | 3 | 4 | 8 |
| 8 | 3 | 4 | 7 | 5 | 2 | 9 | 6 | 1 |
| 1 | 6 | 9 | 3 | 8 | 4 | 2 | 5 | 7 |
| 9 | 4 | 6 | 2 | 3 | 1 | 8 | 7 | 5 |
| 3 | 8 | 1 | 5 | 9 | 7 | 4 | 2 | 6 |
| 7 | 2 | 5 | 4 | 6 | 8 | 1 | 3 | 9 |

అక్టోబర్' 10 సుడోకు పజిల్స్‌కు విజేతలు లేనందు వల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.

పజిల్ – 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 7 | 9 | 4 | 5 | 6 | 8 | 3 | 1 |
| 5 | 4 | 1 | 3 | 8 | 7 | 2 | 9 | 6 |
| 3 | 6 | 8 | 2 | 9 | 1 | 7 | 5 | 4 |
| 9 | 1 | 6 | 5 | 3 | 2 | 4 | 8 | 7 |
| 7 | 2 | 5 | 8 | 6 | 4 | 9 | 1 | 3 |
| 4 | 8 | 3 | 1 | 7 | 9 | 5 | 6 | 2 |
| 6 | 5 | 7 | 9 | 4 | 3 | 1 | 2 | 8 |
| 8 | 3 | 2 | 7 | 1 | 5 | 6 | 4 | 9 |
| 1 | 9 | 4 | 6 | 2 | 8 | 3 | 7 | 5 |

# బెలూన్ గొట్టం

ఈ సాదా పంపుతో మీరు వాస్తవానికి ఒక బెలూన్‌నే నింపి ఉబ్బించవచ్చు.



ఏమేం కావాలి?

- రెండు సినిమా రీళ్ల డబ్బాలు, 15 సెంటీ మీటర్ల పొడవైన పాత సైకిల్ ట్యూబ్, గట్టి స్ట్రా, సెల్లో టేప్.

తయారు చేయడం ఎలా?



- ఒక ఫిల్మ్ రీల్ డబ్బా అడుగున ఒక సెంటీ మీటర్ మందాన చక్కటి రంధ్రాన్ని చేయండి. కత్తెర ఒక కొసను డబ్బా అడుగున పెట్టి మెత్తగా తిప్పుతూ పోతే రంధ్రం పడుతుంది.



- ఫిల్మ్ రీల్ డబ్బా అడుగు భాగంపై ఒక టేప్ అంటించండి. ఈ టేప్ గట్టి కీలులాగా పనిచేస్తుంది. దీన్ని కవాటంలాగా తెరవవచ్చు లేదా మూయవచ్చు. ఇది సక్షన్ వాల్వ్ లాగా పనిచేస్తుంది.



- రెండో రీల్ డబ్బా మూతపై ఒక రంధ్రం పెట్టండి. క్యాప్ లోపల మరొక టేప్ వాల్వ్‌ని అంటించండి. ఇది డెలివరీ వాల్వ్‌లాగా ఉంటుంది.



- ఈ డబ్బాలో చిన్న రంధ్రం పెట్టి డెలివరీ పైపును నొక్కి దీనిలోకి అమర్చండి. వాల్వ్ మూతను బిగించండి.



- ఈ రెండు డబ్బాలను 15 సెంటీమీటర్ల పొడవున్న పాత సైకిల్ ట్యూబ్ ఇరు కొసలలో బొమ్మలో చూపిన విధంగా అమర్చండి. డెలివరీ పైపుకు రబ్బర్ బ్యాండ్‌తో ఒక మధ్య రకం బెలూన్‌ను అమర్చండి. పదే పదే పంప్ చేయడం ద్వారా బెలూన్ తిత్తి నిండుతుంది.



**కాన్సెప్ట్:** ఏ గొట్టంని చూసినా సరే దాని పని తీరు వెనుక, దిశా దశా లేకుండా పయనించే గాలి ప్రవాహం సూత్రంలా పనిచేస్తూ ఉంటుంది. సాదాగానే ఉన్నప్పటికీ చక్కటి పొంకంతో ఉండే సెల్లో టేప్ కవాటం సరిగ్గా ఈ పనే చేస్తుంది.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I am not well. | Come home. |
|---|---|---|
| Telugu | నా ఆరోగ్యం బాగాలేదు. | ఇంటికి రండి. |
| Hindi | मेरी तबीयत ठीक नहीं है.<br>మేరీ తబీయత్ ఠీక్ నహీం హై. | घर आओ.<br>ఘర్ ఆవో. |
| Tamil | எனக்கு உடல்நலம் சரியில்லை<br>ఎనక్కు ఉడల్‌నలమ్ సరీయిల్లై. | வீட்டுக்கு வாருங்கள்<br>వీటుక్కు వారుంగళ్. |
| Bengali | আমি ভালো নেই।<br>అమి బాలో నై. | বাড়ীতে এসো।<br>బాడితే ఎసో. |
| Marathi | माझी तब्बेत बरी नाहीये.<br>మాఝీ తబ్బేత్ బరీ నాహీయే. | घरी या.<br>ఘరీ యా. |
| Kannada | ನನಗೆ ಆರೋಗ್ಯ ಸರಿ ಇಲ್ಲ<br>ననగె ఆరోగ్య సరి ఇల్ల. | ಮನೆಗೆ ಬನ್ನಿ<br>మనెగె బన్ని. |
| Oriya | ମୋର ଦେହ ଭଲ ନାହିଁ।<br>మొర దేహ బాల నాహిన్. | ଘରକୁ ଆସନ୍ତୁ।<br>ఘరకు ఆసంతు. |
| Gujarati | મારી તબિયત ઠીક નથી.<br>మారీ తబియత్ ఠీక్ నథీ. | ઘરે આવો.<br>ఘరె ఆవో. |
| Assamese | মই অসুস্থ।<br>మయీ అసుస్థా | ঘৰলৈ আহ<br>ఘరొలి ఆహ్ |
| Malayalam | എനിക്ക് സുഖമില്ല.<br>ఎనిక్కు సుఖమిలా. | വീട്ടിലേക്ക് വാ.<br>వీట్టిలెక్కువా |
| Santali | ᱵᱮᱥ ᱵᱟᱹᱱᱩᱜ ᱤᱧᱟ᱾<br>బెస్ బానుగ్ ఇంజా. | ᱚᱲᱟᱜ ᱫᱮᱞᱟ᱾<br>ఒడాగ్ డెలా. |
| Sanskrit | मम स्वास्थ्यम् न ऋतम्।<br>మమ స్వాస్థ్యమ్ న రుతమ్. | गृहम् आगम्।<br>గృహమ్ ఆగమ్. |





| English | Do you want water? | Throw me the ball. |
| --- | --- | --- |
| Telugu | మీకు నీళ్లు కావాలా? | బంతిని నా వైపు విసరండి. |
| Hindi | क्या तुम्हें पानी चाहिये?<br>క్యా తుంహైన్ పానీ చాహియే? | गेंद मेरी ओर फेंको।<br>గెంద్ మేరీ ఓర్ ఫెంకో. |
| Tamil | உனக்குத் தண்ணீர் வேண்டுமா?<br>ఉనక్కు తన్నీర్ వేణ్డుమా? | பந்தை என்னிடம் வீசு!<br>పంతై ఎన్నిడం వీసు! |
| Bengali | তুমি কি জল চাও?<br>తుమి కి జల్ ఛాఓ? | বলটা আমায় ছুঁড়ে দাও।<br>బాల్టా ఆమాయ్ ఛుర్హే ధాఓ. |
| Marathi | तुम्हाला पाणी हवे?<br>తుమ్హాలా పాణీ హవే? | बॉल माझ्याकडे फेका.<br>బాల్ మాఝ్యాకడే ఫెకా. |
| Kannada | ನಿಮಗೆ ನೀರು ಬೇಕೇ?<br>నిమగె నీరు బేకే? | ಚೆಂಡನ್ನು ನನ್ನತ್ತ ಎಸೆ<br>చెండన్ను నన్నత్త ఎసె. |
| Oriya | ତୁମକୁ ପାଣି ଦରକାର କି?<br>టుమకు పాని దరకారా కి? | ବଲ୍‌ଟି ମୋ ପାଖକୁ ଫୋପାଡ଼।<br>బాల్టి మొ పక్కాకు ఫొపాడ. |
| Gujarati | તમને પાણી જોઈએ છે?<br>టమనే పానీ జోయి చె? | દડો મારી તરફ ફેંકો.<br>దడో మారీ తరఫ్ ఫెంకో. |
| Assamese | আপোনাক পানী লাগে নেকি?<br>ఆపొనాక్ పానీ లాగే నేకి? | বলটো মোলৈ দলিয়াই দিয়া।<br>బలటో మోలై దలియాయి దియా. |
| Malayalam | നിനക്ക് വെള്ളം വേണോ?<br>నినక్కు వెల్లమ్ వెనో. | എനിക്ക് ബോൾ എറിഞ്ഞുതരൂ.<br>ఎనిక్కు బాల్ ఎరింజుథారో. |
| Santali | ᱫᱟᱜ ᱮᱢ ᱞᱟᱹᱠᱛᱤᱜ ᱠᱟᱱᱟ?<br>దాగ్ ఎమ్ లాక్టిగ్ కానా? | ᱵᱚᱞ ᱤᱧ ᱥᱮᱫ ᱪᱟᱯᱟᱫ ᱢᱮ<br>బోల్ ఇంజ్ సెడ్ చపాడ్ మే. |
| Sanskrit | किं त्वं जलं पातुम् इच्छसि?<br>కిం త్వం జలం పాతుమ్ ఇచ్ఛసి? | कन्दुकं मां प्रति क्षिप।<br>కన్దుకం మాం ప్రతి క్షిప్. |

# భారత దర్శిని

## 162 మంది సభ్యుల మహా కుటుంబం



ఈ మహా కుటుంబాన్ని బక్తాంగ్‌కు 100 కిలోమీటర్ల దూరంలో మనం చూడగలం. కుటుంబ పెద్ద, మరియు ఛనా తెగ నేత జివోనాకు 66 ఏళ్లు నిండాయి. ఇతడికి 38 మంది భార్యలు 94 మంది పిల్లలు ఉన్నారు. వీరిలో కొందరికి పెళ్లిళ్లయిపోయి పిల్లలు కూడా పుట్టారు. చువాన్ థట్ రన్ లేదా 'కొత్త తరం' అని పేరున్న భవంతిలో వీరంతా కలిసి జీవిస్తున్నారు. వీరంతా విడివిడిగా గదులు కలిగి ఉన్నప్పటికీ ఒకే వంటశాలను పంచుకుంటుంటారు.

వారు ఒక సారి భోంచేయడానికి 30 నుంచి 35 కేజీల బరువుండే పందిని సిద్ధం చేస్తారట. ఒక్కసారికి 50 కేజీల బియ్యం వండుతారు. ఈ తెగ సభ్యుల సంఖ్య 3,000. వీరంతా 350 ఇళ్లలో నివసిస్తుంటారు. ఈ తెగలోని అధిక శాతం సభ్యులు బక్తాంగ్ గ్రామంలోనే ఉంటున్నారు. నిజంగానే ఇది మహా కుటుంబం కదూ!

## ఏడుపులో పోటీ

ఒరిస్సాలోని కోణార్క్‌లో అర్కశ్రీ సంస్థ నిర్వహించిన పోటీలో 20 మంది స్త్రీలు పాల్గొని ఏడవసాగారు. పోటీలో పాల్గొన్నవారు పెళ్లయ్యాక తమ పుట్టినిల్లుకు వీడ్కోలు పలికే విషాదాన్ని గుర్తు చేసుకుంటూ పద్యాలతో ఏడుపు మొదలెట్టారు.

పెళ్లయిన అమ్మాయి పుట్టింటి నుంచి అత్తగారింటికి వెళ్లేటప్పుడు విలపిస్తూ పద్యం చదవడం ద్వారా తనను తాను ఆవిష్కరించుకుంటుందని పాత సామెత ఉంది. కను మరుగైపోయిన ఈ సంప్రదాయాన్ని తిరిగి వెలుగులోకి తీసుకురావడం కోసం అర్కశ్రీ సంస్థ ఈ ఏడుపు పోటీని నిర్వహిం చింది.



పోటీలో భాగంగా నిర్వాహకులు పద్యాల పుస్తకాలను అందించారు. నిజం గానే పోటీ చాలా వినోదాన్ని అందిం చింది. పైగా, యువతులు శాస్త్రోక్తంగా ఏడ్చే కళను నేర్చుకున్నారు కూడా.

# ఎత్తుకు పై ఎత్తు

1



ఒక రుషి దారి వెంబడి నడిచిపోతూ ఒక రోజు తెనాలి రామలింగడిని దగ్గిరనుండి చూసి అతడిలో పవిత్ర జ్యోతి ఉన్నట్లు గుర్తించాడు.

2



రుషి రామలింగడిని పేరుతో పిలిచి అడవిలోని మహాకాళి ఆలయానికి తోడుగా రమ్మన్నాడు. రామలింగడు అతడితో కలిసి వెళ్లాడు.

3



రుషి రామలింగడి చెవిలో ఒక మంత్రం చదివాడు. ''ఈ మంత్రాన్ని క్రమం తప్పకుండా జపించు. మహాకాళి నీకు పలు వరాలను! ఇస్తుంది''

4



రామలింగడు మంత్రాన్ని జపిస్తాడు. మహాకాళి సాక్షాత్కరిస్తుంది. ''బిడ్డా, నీ భక్తికి మెచ్చాను. నీకో వరం ఇస్తాను కోరుకో''

5



దేవి రెండు వెండి పాత్రలను తన అరచేతుల్లో పట్టుకుంది. 'రెండు పాత్రలను చూశావా? ఒకదాంట్లో పాలు ఉన్నాయి. రెండో దాంట్లో పెరుగు ఉంది''

6



''పాలు సేవిస్తే నీవు మహా పండితుడివి అవుతావు, పెరుగు సేవిస్తే సంవదలలో ఓలలాడతావు. నీకు ఏదో ఒకటి మాత్రమే దక్కుతుంది. తెలివిగా ఎంచుకో''



రామలింగడు ఒక్క క్షణం కూడా వృథా చేయకుండా దేవి చేతుల్లోంచి రెండు పాత్రలనూ తీసుకుని గటగటా తాగేశాడు. కాళి ఆశ్చర్యపోయింది. ''ఎందుకిలా చేశావు'' అని అడిగింది.



''మాతా, నాకు రెండూ కావాలి. సంపద లేకుండా పండితుడిని అయితే ఏం లాభం? నేను తప్పు చేసి ఉంటే క్షమించు తల్లీ''



కాళికా మాత అతడి నిజాయితీకి, తర్కానికి ముగ్ధురాలైంది. ''నీవు వికటకవి అవుతావు పాండిత్యంలోనూ, సంపదలోనూ కూడా తులతూగుతావు, తథాస్తు.''

## హాస్య చిత్రం









# కూరగాయల నిధి

ఒక నిర్దిష్ట థీమ్‌తో మీరు ఆల్బమ్‌ని రూపొందించడానికి, కింద ఇచ్చిన చిత్రాలను ఉపయోగించవచ్చు. ఈ నెల అంశం ''కూరగాయలు''


















CHANDAMAMA (Telugu) December 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బుబ్బా జట్టు సాహసాలు




అర్లీన్, విజయ్, ఇర్ఫాన్, అఖిల్ విహారానికి వెళుతున్నారు.

అయ్యో! ఎంత సుదీర్ఘ ప్రయాణమో!

మన గమ్యానికి చాలా దగ్గిరకొచ్చేశాం.

మనం హోటల్‌కి వెళ్లి స్నానం చేసేదాకా నేను తాళలేను బాబూ.

అంతవరకు దేనికి, నేను నేరుగా ఈత కొలనులోకే దూకేస్తాను.

విజయ్ మన విహారం ముగిసేంతవరకూ నిద్రలోనే ఉంటాడనిపిస్తోంది.

తనను లేపండిక.. మనం దిగాల్సిన చోటు సమీపిస్తోంది.

విజయ్... విజయ్.. లేవరా..

అయిదే అయిదు నిమిషాలు ప్లీజ్‌రా..

ఎలాగోలా వాళ్లు విజయ్‌ని లేపారు, అఖిల్ అతడి నోట్లో ఏదో పెట్టాడు.

విజయ్ చప్పరించాడు, ఉన్నట్లుండి నీరు ధారగా అతడి ముఖంపై పడి శుభ్రపర్చింది.

వావ్...

బస్సు ఆగీ ఆగగానే విజయ్ ఈతకొలను వైపు పరుగెత్తాడు.

అమ్మయ్య! ఎట్టకేలకు ప్రయాణం ముగిసింది.

ముఖం కడుక్కుని తర్వాత కొలను వైపు వెళదాం.

అటు చూడండ్రా! విజయ్ బట్టలు కూడా విప్పకుండా స్విమ్మింగ్ పూల్‌లో దూకేశాడు!

రండి రండి. నీళ్లు ఎంచక్కా శుభ్రంగా ఉన్నాయి.

నీది మరీ పిల్ల చేష్ట రా!

ఏంటి మరీ అంత డల్‌గా ఉన్నారు?

వాళ్లు ఒకరినొకరు చూసుకుని నవ్వుకున్నారు, తర్వాత కొలనులోకి దుమికారు.

నీళ్లు నిజంగా చల్లగా ఉన్నాయి!

ఎంత ఆహ్లాదంగా ఉందో!

వాళ్లలో నలుగురు చేతులు చరిచి అభినందించుకున్నారు.

బుబాలో కూల్ మింట్, ఒక్కసారిగా తాజాదనం.